❋ శ్రీ పరాశర సంహితా ❋

# శ్రీ ఆంజనేయ చరిత్ర

61 నుండి 70 పటలములు

సమర్పణ :

'సాహిత్య విద్యాప్రవీణ'

'వైద్యవిద్వాన్', 'భాషాప్రవీణ' 'హిందీ విశారద'

శ్రీ అన్నదానం చిదంబరశాస్త్రి,

M. A & M. A., P. O. L

ప్రచురణ :


శ్రీ హనుమత్సేవా సమితి

సత్యనారాయణపురం, విజయవాడ-520 011



ఈ పారిజాతము

కలియుగ
ప్రత్యక్ష
దైవమైన
శ్రీ వేంకటేశ్వర
స్వామికి



అంకితము

# పితృవందనం



ఈ రూపు నీయఁగని నా
కీ రీతిగ హానుమ నెంచు నింగిత మిదు సీ
తా రామాంగా లక్ష్మీ
నారాయణులన్ పితరులఁ నమములఁ గొలుతున్॥

- ఆనందనం చిదంబరశాస్త్రి

# మా మాట :

చదువరులకు నమస్కృతులు. ఈ మాటచదివి ఊరుకోక గ్రంథ మంతాచదవాలని మాకోర్కె, అంతేకాదు. మాప్రచురణలన్నీ ఒకమారు పరిశీలించమని మా విజ్ఞప్తి. మీఆదరం వల్లనే శ్రీఆంజనేయచరిత్ర ఇంతముందుకురాగల్గినది. మా కృషిని అభినందించమని కోరం ఆశీర్వ దించమనే మా ప్రార్థన.

ఈ పుస్తకం మీచేతిలోకి వచ్చిందంటే దాని వెనుకఉన్న కష్ట మెంతో ఒక్కమారాలోచించండి ఇది వేలసంవత్సరాలుగా వ్రాతప్రతులలో మ్రగ్గుచున్న ఉద్గ్రంథము. ఇంతటి గ్రంధాన్ని ముద్రించి వెలుగులోకి తీసుకురావాలని ఇన్నేండ్లుగా ఎవ్వరు చేయని సాహసానికి మేముపూను కొన్నాము. అనేక ప్రాంతములు పర్యటించి వ్రాతప్రతులను సేకరించి సంస్కృతమూలము సామాన్యజనులకు ఉపయోగపడే విధంగా చక్కని భావాన్ని శ్రీఅన్నదానం చిదంబరశాస్త్రిగారు అందిస్తున్నారు. కార్యకర్తల మైన మేము ప్రతివ్యక్తిని కలిసి ప్రతిపైస కూడబెట్టి కొద్దికొద్దిభాగాలుగా ప్రచురిస్తున్నాము. స్వామిచరిత్ర ఇప్పటికి 70పటలములు ముద్రించ గలిగామంటే, అదిశ్రీ హనుమద్భక్తులప్రోత్సాహమే.

ఈ భాగము వెలువడుటకు సహకరించిన భక్తులకు కృతజ్ఞతలు తెలుపుతూ శ్రీఆంజనేయస్వామివారు సదరు దాతలకు ఆయురారోగ్యైశ్వ ర్యములు ప్రసాదించుగాక అని ప్రార్థించుచున్నాము.

— ప్రకాశకులు

# ఇందులో . . .

# శ్రీ పరాశర సంహితా

## (శ్రీ ఆంజనేయ చరిత్ర)

### ఏకషష్టితమః పటలః

### ముద్రా లక్షణం

శ్రీ మైత్రేయః -

శ్లో॥ పరాశర నమ స్తుభ్యం - దీనబంధో దయానిధే ।
తత్త ద్ధర్మవిశేషేషు - సంశయం హర మామకమ్॥

తా॥ శ్రీమైత్రేయులవారడుగుచున్నారు. దీనబంధుఁడా ! కరుణా పూర్ణుఁడా ! పరాశర మహాముని ! నీకు నమస్కారము. ఆయా ధర్మ విశేషములందు నాకున్న సందేహములను తీర్చుము,

శ్లో॥ త్వయా ప్రోక్తాః పురా బ్రహ్మన్ - కరుణాపూర్ణచేతన ।
హనూమ న్మంత్రవిషయే - ముద్రా షోడశ వర్ణితాః॥

తా॥ దయాపూర్ణమైన హృదయము కల ఓ బ్రాహ్మణోత్తమా ! పూర్వము నీచే హనుమన్మంత్ర విషయమున పదునారు ముద్రలు చెప్ప బడినవి.

శ్లో॥ లక్షణాని కథం తాసాం - ప్రత్యేకం నియతః పృథక్
కృపాసర్వ మశేషేణ - దయామయ । త వాస్తిచేత్॥

తా॥ ఓ దయామయుడా - నాపై నీకు గొప్ప యనుగ్రహమున్న యెడల ఆ ముద్రలకు లక్షణము లెట్లుండునో ప్రత్యేకముగా విభజించి చెప్పవలసినది.

శ్రీ పరాశరః :—

శ్లో॥ వక్ష్యే షోడశముద్రాణాం – లక్షణాని పృథక్ పృథక్
యథా వా చేతన స్సద్యః – ముద్రాఫల మవాప్నుయాత్॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా! ఆచరించు మనుష్యునకు వెంటనే ముద్రాఫలమును ప్రసాదించెడి పదునారు ముద్రల లక్షణములను వేరువేరుగ చెప్పుచున్నాను.

శ్లో॥ కరద్వయాంగుష్ఠయోగ – తర్జ న్యుభయమూలయోః
సవ్యాంగుష్ఠోపరి స్థిత్వా – దక్షిణాంగుష్ఠ పర్వణి।
శేషాణాం ఋజు భావేన – ప్రస్తుతా ఖ్యాతు ముద్రికా

తా। రెండుచేతుల చూపుడు వ్రేళ్ళ మూలములయందు రెండు బొటన వ్రేళ్ళనుంచి ఆ బొటనవ్రేళ్ళ పైభాగమున మిగిలిన వ్రేళ్ళను ఋజుభావములో నుంచుటకు ప్రస్తుత ముద్రయని పేరు.

శ్లో॥ ఉత్తాన వక్రాంగుళినా – వామేన గ్రథితా యది
దక్షిణాగ్రకరాంగుళ్యా – స్త్వనులోమ విలోమతః
ముద్రేయం గాలినీ ప్రోక్తా – ముద్రా సిద్ధాంతవేదిభిః॥

తా॥ దక్షిణ హస్తపు వ్రేళ్ళు పైన నుండునటుల అనులోమ విలోమముగా వ్రేళ్ళనుంచుటకు గాలినీ ముద్రయని సిద్ధాంతమెఱిగినవారిచే చెప్పబడినది.

శ్లో॥ ఉత్తానాగ్రతలే వామే – కించి దాకుంచితాంగుళౌ
అధోముఖాంగుష్ఠ తర్జ – న్యంతరే కరభస్పృశౌ
దక్షిణేన కరే ణైవ – మేళనం పద్మముద్రణమ్॥

తా। ఎడమచేతి వ్రేళ్ళను పైకిచూచునటుల పెట్టి కొంచెము వంచి యుంచి కుడి చేతితో బొటనవ్రేలు, చూపుడు వ్రేళుల మధ్య భాగమును

తాకునటుల ఉంచుట పద్మముద్రయగును.

శ్లో॥ కనిష్ఠానామికా మధ్యాంగుళిభి ర్దక్షిణాంగుళౌ
వామాధోంగుష్ఠ మారుహ్య - శేషాణాం ఋజుమేళనం
కథితా శంఖముద్రేయం - మునిభి స్తత్వదర్శిభిః॥

తా॥ చిటికెనవ్రేలు, ఉంగ్రపువ్రేలు, మధ్యవ్రేళులను ఎడమచేతి బొటనవ్రేలు నధిరోహింపజేసి మిగిలిన వ్రేళ్ళను ఋజువుగానుంచుట తత్త్వమెరిగిన మునులచే శంఖముద్రయని చెప్పబడును.

శ్లో॥ వామ దక్షిణ హస్తాంత స్థలయో ర్వివృతాత్మనోః
అనులోమ విలోమాభ్యాం మేళనం చక్రముద్రణమ్

తా॥ ఎడమ, కుడి అరచేతులను వివృత మొనర్చి అనులోమము గాను, విలోమముగాను త్రిప్పుటను చక్రముద్రయందురు.

శ్లో॥ కనిష్ఠయా దక్షిణస్య - గృహీత్వా న్యకనిష్ఠకాం
భజ్త్వా ప్రతిముఖం తే ద్వే - తిర్యంచోనామ మధ్యమే
తర్జన్యః పురతః కృత్వాం - గుష్ఠద్వయ మధో నయేత్
గారుడీముద్రణా ప్రోక్తా - సద్యస్సిద్ధి ప్రదాయినీ॥

తా॥ కుడిచేతి చిటికెన వ్రేలితో ఎడమచేతి చిటికెనవ్రేలు గ్రహించి బొటనవ్రేళ్ళను క్రిందకు వంచుచు చూపుడు వ్రేళ్ళను ముందుకు చూపుచు నుంచిన మంత్రసిద్ధి నీయజాలిన గారుడీముద్రయగును.

శ్లో॥ సంయోజ్య హస్తౌ ద్వౌ సమ్య జ్నిధాయ స్వస్య మూర్ధని
దర్శితం ఋజుభావేన - నతిముద్రా ప్రకీర్తితా॥

తా॥ రెండుచేతులను జోడించి తన శిరస్సుపై నుంచుకొని ఋజు భావముగ నుంచి నమస్కరించుటకు నతిముద్రయనిపేరు.

శ్లో॥ తర్జన్యాయ త్తమూలా స్యా - ద్వక్రాగ్రా దక్షిణే కరే
ముకుళాయితరాంగుళ్య స్తదా ముద్రాం కుశా భిధా॥

తా॥ కుడిచేతి చూపుడు వ్రేలుచూపి చివర వంచబడియుండగా మిగిలిన యంగుళుల నన్నిటిని ముడిచి యుంచినప్పుడు అంకుశ ముద్ర యగును.

శ్లో॥ మధ్య మానామికాంగుష్ఠ - మేళనం కరయో ర్ద్వయోః
ఏకత్రైవ వృతా సమ్య జ్మృగీముద్రా ప్రకీర్త్యతే॥

తా॥ రెండు చేతుల యొక్క మధ్యవ్రేళ్ళు, ఉంగరపువ్రేళ్ళు, బొటన వ్రేళులను కలిపి ఒకచో చేర్చిన మృగీముద్రయగును.

శ్లో॥ కనిష్ఠానామికా యోగో - వామదక్షిణ హ స్తయోః
తర్జనీ మధ్యమా యోగ - స్తయో రేవ తథైవతు
ధేనుముద్రేతి విఖ్యాతా-చతుర్యుగ సమన్వితా॥

తా॥ ఎడమ చిటికెన వ్రేలికి కుడిచేతి ఉంగ్రపు వ్రేలిని కుడిచేతి చిటికెన వ్రేలికి ఎడమచేతి ఉంగ్రపు వ్రేలిని, కుడిచేతి మధ్యమ వ్రేలికి ఎడమచేతి చూపుడువ్రేలిని, ఎడమచేతి మధ్యమవ్రేలికి కుడిచేతి చూపుడు వ్రేలిని ఈ నాల్గు జతలను కలుపుటకు ధేనుముద్ర యనిపేరు. దీనినే సురభిముద్ర యందురు.

శ్లో॥ సంపుటీకృత హస్తౌ ద్వౌ - కించి దుచ్ఛూనగర్భితా
కుంభముద్రేతి విఖ్యాతా - పూజితా సర్వయోగిభిః॥

తా॥ రెండు చేతుల వ్రేళ్ళను సంపుటీకరణమొనర్చి గర్భభాగ మును పెద్దదిగా నుండునట్లుపెట్టి పైకిచూపునట్లుంచిన సర్వయోగులచే పూజింపబడుచు ప్రశస్తమైన కుంభముద్ర యగును.

శ్లో॥ కరౌ ద్వౌ ప్రతిలోమేన హ్యుత్తాన గ్రథితాంగుళీః
భంక్త్వా చాభిముఖం సమ్య - గున్నతాంగుష్ఠ తర్జనీ

ఇయం సంహారముద్రా స్యా త్సద్యో యోగస్య సిద్ధిదా॥

తా॥ రెండుచేతుల వ్రేళ్ళను ప్రతిలోమముగనుంచి వ్రేళ్ళనుపైకి చూపుచునుంచి ఆ ముద్రనభిముఖము చేసికొనుచు త్రిప్పి బొటనవ్రేళ్ళను, చూపుడు వ్రేళ్ళను ఉన్నతముచేసి చూపుటకు సంహారముద్ర యనిపేరు. ఇది వెంటనే యోగసిద్ధి నిచ్చును. దీనినే నిర్యాణముద్ర యందురు.

శ్లో॥ స్వసోర్వోరు కరాభ్యాం చే చ్ఛనై స్సంతాడయే న్ముహుః
ముద్రా మ ల్లచ్ఛళికాఖ్యా — ఇతి ముద్రావిదో విదుః॥

తా॥ తనతొడలపై అరచేతులతో మెల్లగా మరల మరల కొట్టుటకు మల్లచ్ఛళికాముద్రయని ముద్రల నెఱిగినవారు చెప్పుదురు.

శ్లో॥ నృత్యత్పదః కలియుగే - భూయో భూయః పరస్పరం
శనై శ్శనై స్తాడయే చ్చే - న్ముద్రాస్యా త్తాండవాభిధా॥

తా॥ నృత్యమొనర్చు పాదములను మెల్లమెల్లగ తాడన మొనర్చిన తాండవమను పేరుగల ముద్రయగును.

శ్లో॥ వామహస్తంతు విన్యస్య — శిరస్యాధాయ దక్షిణం
అంగుళ్యగ్రౌ పురో దృష్టౌ వాలముద్రా ప్రకీర్తితా॥

తా॥ ఎడమ అరచేతిని హృదయముపై నుంచి కుడిచేతిని శిరస్సుమీదుగా వాలమువలెపెట్టి వ్రేళ్ళను ముందుభాగమునకు చూపించుటకు వాలముద్రయనిపేరు. హనుమన్మంత్ర జపమునకు ముందీముద్ర అవశ్యముగ వేయవలెనని పెద్దలు చెప్పుదురు.

శ్లో॥ వివృత్య శ్రవణే నేత్రే - ప్రసార్య పురతో ముఖం
అపూర్య తాలునీ సమ్య క్ఫూత్కారై రంతరాళగైః
విష్టభ్య జానునీ భూమౌ - సకృదేవ స్వకే వుభౌ
మధ్యమానామికాంగుష్ఠ - దృఢసంయోగ పూర్వకం
ఉక్షిప్య బాహుమధ్యే ద్వౌ - సమౌ కర్ణాంతగామినౌ

భూతప్రేతాదిసంస్థానం - భీకరం ప్రవిలోకయేత్
సైషా తు హనుమన్ముద్రా - కథితా మంత్రవిత్తమైః॥

తా॥ మోకాళ్ళను రెంటినొక్కమారుగా భూమియందుంచి రెండు చేతులయొక్క మధ్యమ అనామిక, బొటనవ్రేళ్ళను గట్టిగా కలిపి వాటి నెత్తి చెవులకు సమముగా బాహుమధ్యమున నుంచి భూతప్రేతాదులను భయపెట్టినట్లు కళ్ళను, చెవులను విప్పార్చి చూచుచు ముఖమును ముందుకుజాపి బుగ్గలనిండుగ గాలినింపి బాగుగా ఫూత్కారమొనర్చిన అది హనుమన్ముద్ర యగునని మంత్రవేత్తలు చెప్పుదురు. పైముద్రలన్నియు సద్గురువులకడ ప్రత్యక్షముగ గ్రహింపదగును.

శ్లో॥ ఇత్యేవం కథితం బ్రహ్మన్ - ముద్రాణాం లక్షణం మయా
హనుమన్మంత్రజాలానాం - ఇమే ముద్రాః ప్రకీర్తితాః
ముద్రా తల్లక్షణజ్ఞానా - దనుష్ఠానఫలం లభేత్॥

తా॥ ఓ బ్రాహ్మణోత్తమా! ఈరీతిగా నాచే ముద్రల లక్షణము చెప్పబడినది. పై ముద్రలు హనుమన్మంత్ర సమూహమునకు చెప్ప బడినవి. ఈ ముద్రల లక్షణ మెరుగుటవలన అనుష్ఠాన ఫలము లభించును.

శ్లో॥ సమ్యగ్జప్తోఽపి మంత్రాణాం అజ్ఞాత్వా ముద్రణాం పృథక్
ఫలాని న ఫలం త్వర్థా హ్యూసరక్షేత్ర బీజవత్॥

తా॥ ముద్రలను తెలిసికొనక మంత్రముల నెంతబాగుగా జపించి నను చవుటినేలయందు పెట్టిన విత్తనములు మొలకెత్తక వ్యర్థమగునట్లు సత్ఫలితముల నీయవు.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయ సంవాదే
పంచముఖ హనుమన్మహామంత్ర వివరణే
ఏకషష్టి తమః పటలః

# శ్రీ పరాశర సంహితా

## ద్విషష్టితమః పటలః

## హనుమద్విగ్రహ లక్షణం

శ్రీ మైత్రేయః

శ్లో॥ పరాశర నమ స్తుభ్యం - సంశయం మే నివారయ
హనుమ ద్విగ్రహాణాం చ - జఘన్య స్పర్శనం యది
ప్రాయశ్చిత్తం భవే త్తస్య - కిం వా త ద్యేన శుద్ధ్యతి॥

తా॥ శ్రీ మైత్రేయులవా రడుగుచున్నారు. ఓ పరాశర మహామునీ! నీకు నమస్కారము. నా యొక్క సందేహమును తీర్చుము. హనుమ ద్విగ్రహములకు అధమస్పర్శ జరిగినచో ప్రాయశ్చిత్తమెట్లు చేయవలెను. అది ఎట్లు శుద్ధియగును?

శ్రీ పరాశరః-

శ్లో॥ ప్రతిమాం శోధయేత్ సమ్యక్ — తింత్రిణీఫల కర్దమైః
పంచామృతై ర్పంచగవ్యైః మార్జయే త్పంచపల్లవైః॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా! హనుమ ద్విగ్రహమునకు నీచస్పర్శ జరిగినచో ఆ విగ్రహమును చింతపండు పులుసుతో బాగుగా తోమవలెను. పిదప పంచామృతములగు ఉదకము, పాలు, పెరుగు, నేయి, తేనెలతోను, పంచగవ్యములగు ఆవుపేడ, ఆవు పంచితము, ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునేతులతోను, పంచపల్లవము లగు రావి, మేడి, మఱ్ఱి, మామిడి, జువ్వి, ఆకులతో మార్జన మొనర్చ వలెను.

శ్లో॥ స్నాపయే ద్ద్వాదశావృత్యా - పురుషసూక్త విధానతః
హునే శ్చ ద్వాదశావృత్యా - సప్తాక్షర్యా హనూమతః॥

తా॥ పురుషసూక్త విధానముతో పండ్రెండుమార్లు స్నానము చేయించవలెను. సప్తాక్షరీ హనుమన్మహామంత్రముతో పండ్రెండుమార్లు హోమము చేయవలెను.

శ్లో॥ బ్రాహ్మణా న్పూజయే త్పశ్చాత్ - స్వ స్వశ క్త్యనుసారతః
హనుమద్విగ్రహం స్పృష్ట్వా -దక్షిణేన కరేణ వై
ఆంజనేయస్య గాయత్రీం -జపే దష్టోత్తరం శతమ్॥

తా॥ పిదప తమతమశక్తి ననుసరించి పూజనీయులగు బ్రహ్మవేత్తలకు సమారాధన మొనర్చవలెను. కుడిచేతితో హనుమద్విగ్రహమును తాకుచు ఆంజనేయ మంత్రగాయత్రిని నూట ఎనిమిది పర్యాయములు జపించవలెను.

శ్లో॥ బుద్ధేః ప్రమాదా దాలాస్యా - త్శ్వపచ స్పర్శనా దపి
అగ్నితప్తా ద్భవే త్శుద్ధిః -గృహదాహే ఒథవా మునే॥

తా॥ బుద్ధి పొరపాటువల్ల ఆలస్యము చేయుట వల్లకాని, అధమాధమ సంస్పర్శన వలన కాని అగ్నితప్తమైనగాని ఆ ఇల్లు తగులబడినను

శ్లో॥ ప్రాణప్రతిష్ఠా దారభ్య -సంస్కుర్యా త్పూర్వవ త్పునః

తా॥ ప్రాణప్రతిష్ఠ మొదలుకొని పూర్వమువలె అన్ని సంస్కారములు చేయవలెను.

శ్లో॥ స్థావరాణాం చ మూర్తీనాం -కదాచి చ్చలనం యది
నీచస్పృష్టాయ అఖ్యాతః -ప్రాయశ్చిత్తవిధి ర్మునే।

తా॥ మూలవిరాట్ విగ్రహములనెప్పుడైనమార్చవలసి వచ్చినచో నీచుల స్పర్శ జరిగినచో ఓ మైత్రేయా! ప్రాయశ్చిత్త విధానము చెప్పబడినది.

శ్లో॥ తేనైవ విధినా సమ్య క్సంస్కుర్యా త్పూజ్యవిగ్రహాన్
సంవత్సర ర్తు మాసేషు-పూజా సంస్కార వర్జితాన్॥

తా॥ పూజింపదగిన విగ్రహములకు ఆయా సంవత్సర, ఋతు, మాసములందు పూజ మానివేయబడినచో పైవిధానమున బాగుగ సంస్కార మొనర్చవలెను.

శ్లో॥ మార్జనే పురుషైః సూక్తైః - ప్రతిమాం స్తు యథావిధి
తతఃపరం యథాశక్త్యా - బ్రాహ్మణా న్భోజయే న్మనే॥

తా॥ ప్రతిమనుయథావిధిగా పురుషసూక్త విధానముతో మార్జన మొనర్చవలెను. పిదపశక్తిననుసరించి బ్రహ్మవేత్తలకు భోజనము పెట్టవలెను.

శ్లో॥ శ్రోత్రియాణాం ద్విజాతీనాం - సర్వదా నియతాత్మనాం
సంతర్పణం విధివత్ - ప్రాయశ్చిత్తవిధి స్మృతః॥

తా॥ ఎల్లప్పుడు ఆత్మసంయమనము కల్గియుండు శ్రోత్రియులగు ద్విజులకు యథావిధిగా సంతర్పణ చేయుట ప్రాయశ్చిత్త విధానమున తెలియదగును.

శ్లో॥ సంతర్పణం వినా మంత్రో - దైవతం గురు రన్యథా
కదాచి న్న ప్రసీదంతి - తస్మా ద్బ్రాహ్మణభోజనమ్॥

తా॥ సంతర్పణములేక మంత్రముకాని, దైవముకాని, గురువుకాని వేరొకరీతిగా ఎన్నడును అనుగ్రహింపరు. ఆకారణమున బ్రాహ్మణ భోజనము విధింపబడినది.

శ్లో॥ హనుమ త్ప్రతిమోత్కర్షం - వక్ష్యామి మునిపుంగవ॥
యత్ప్రభావా దశేషా స్తు సిద్ధ్యంతి చ మనోరథాః॥

తా॥హనుమద్విగ్రహమహిమను చెప్పెదను. ఓ మునిశ్రేష్ఠా! దా ప్రభావము వలననే కోరిన కోరికలన్నియు తీరుచున్నవి.

శ్లో॥ శ్వేతార్కమూలం సంగృహ్య -భానువారే శుభే దినే
అంగుష్ఠమాత్ర రూపేణ - తత్ప్రాకారాతో ఽపి వా
తేనైవ ప్రతిమాం కుర్యా - ద్ధనుమద్రూప శోభితామ్॥

తా॥ ఆదివారముమంచిరోజున తెల్లజిల్లేడు వేరుతెచ్చి బొటనవ్రేలి ప్రమాణముగాకాని, లేదా బొటనవ్రేలి కణుపు ప్రమాణముగాకాని అంజనేయుని రూపముతో ప్రకాశించెడి రూపమును ఆవేరుతో చేయవలెను.

శ్లో॥ ప్రాణ ప్రతిష్ఠాం కుర్వీత - బ్రాహ్మణా న్భోజయే త్తతః
రక్త వస్త్రై రక్తగంధై - రక్తమాల్యాక్షతై రపి
పూజయే న్మందవారేషు - పంచసు ప్రతిమాం హరేః॥

తా॥ ప్రాణప్రతిష్ఠచేసి సమారాధన మొనర్చవలెను, ఎఱ్ఱని వస్త్రముల తోను, ఎఱ్ఱ గంధముతోను ఎఱ్ఱని మాలికలతోను, ఎఱ్ఱని అక్షతల తోను ఐదు శనివారములు ఆ హనుమంతుని ప్రతిమను పూజింపవలెను.

శ్లో॥ తతః ప్రసన్నో భవతి -హనుమా న్వీరమారుతిః

తా॥ ఆరీతిగా తెల్లజిల్లేడు వేరుతో చేయబడిన ప్రతిమను పూజించుట వలన వీరుడు, వాయునందనుడు అగు హనుమంతుడు ప్రసన్నుడగును.

శ్లో॥ హనుమత్ప్రతిమాం దృష్ట్వా -యుద్ధ్య న్నపి మహాహవే
వైరై ర్న హన్యతే క్వాపి -శత్రుభి ర్నాభిభూయతే
అస్త్రై శస్త్రై ప్రహారోపి - పీడ్యతే నైవ కుత్రచిత్॥

తా॥ అటువంటి హనుమద్విగ్రహమును చూచి గొప్ప యుద్ధ మున ప్రవేశించినను ఎంతటి శత్రువులయినను చంపలేరు, ఎదుర్కొన లేరుకూడ. అస్త్రశస్త్రముల దెబ్బకూడ ఎక్కడా ఏ మాత్రమూ బాధింపలేదు.

శ్లో॥ శ్వేతార్కమూల ప్రతిమా - పూజ్యతే హనుమన్మయీ
గృహీత స్యాచిరే ణైవ - సుసిద్ధా సర్వసంపదః॥

తా॥ హనుమంతుని ఆకారముకల శ్వేతార్కమూలమును పూజించిన వానికి వెంటనే సర్వసంపదలు సిద్ధించును.

శ్లో॥ భూత ప్రేత పిశాచాదీ - పలాయంతే భయావృతాః
వ్యాధయో ఽపి న బాధంతే - నాగ్ని చోరాది సాధ్వసమ్॥
సిద్ధ్యంతి సర్వకార్యాణి -నాత్ర కార్యా విచారణా॥

తా॥ భూత ప్రేత పిశాచాదులు భయపడి పారిపోవును. వ్యాధులు కూడ వారిని బాధించవు. అగ్నిభయము, చోరభయము కూడ ఉండవు. వారి పనులన్నియు నిర్విఘ్నముగ నెరవేరును. ఇందు సందేహములేదు.

శ్లో॥ శ్వేతార్క వృక్షో యత్రాస్తే - హనుమ త్ప్రీతికారణః
నిత్యం సన్నిహిత స్తత్ర - హనుమా న్భక్తవత్సలః॥

తా॥ హనుమంతునకిష్టమైనతెల్లజిల్లేడుచెట్టుఎక్కడుండునోఅక్కడ భక్తవత్సలుడగుహనుమంతుడు నిత్యము సన్నిహితుడుగా నుండును.

శ్లో॥ ఉపాస్య భగవా న్శంభుః - పురే శ్వేతార్క మారుతిం
ఇంద్రాదే రజేయాని - త్రిపురాణి జిగాయ సః॥

తా॥ పూర్వము శ్వేతార్క మూలముతో చేసిన హనుమంతుని భగవంతుడగు శివుడు ఆరాధించి ఇంద్రాదులకుకూడ జయింప శక్యముకాని త్రిపురములను జయించెను.

శ్లో॥ తస్మా త్ప్రమాదరహితః - ఏవం సర్వేషు పర్వసు
ఉపాస్య శ్చేప్సితావాప్త్యై - శ్వేతార్క హనుమ త్ప్రభుః॥

తా॥ కావున అన్ని పర్వదినములందును లోపముచేయనివాడై కోరిక లీడేరుట కొఱకు శ్వేతార్క హనుమద్విగ్రహమును పూజింపవలెను.

శ్లో॥ యదా కదాచి త్కాలే ఒపి - జంతో ర్వై జయకాంక్షిణః
శ్వేతార్క హనుమత్పూజా - సర్వకామార్థదాయినీ॥

తా॥ ఏసమయమందైనను జయమును కాంక్షించువారికి శ్వేతార్క హనుమత్పూజ కోరికలన్నిటిని తీర్చగలది.

శ్లో॥ పద్మాదీ న్యాసనా న్యాహుః - జపకాలే మనీషిణః
ఆసనేభ్య శ్చ సర్వేభ్యః - శస్తం వీరాసనం స్మృతమ్॥

తా॥ జపముచేయు సమయమున వేయదగినవిగా పద్మాసనమువంటి ఆసనములను పండితులు చెప్పిరి. అట్టి ఆసనములన్నిటియందు వీరాసనం ప్రశస్తమైనదిగా తెలియుచున్నది.

శ్లో॥ వీరాసనం న యుక్తం స్యా - ద్దేవతా గురుసన్నిధౌ

తా॥ దేవతయొక్క, గురువుయొక్క సన్నిధియందు వీరాసనము వేయుట తగదు.

శ్లో॥ తపతస్సుబహూన్ మంత్రాన్ ప్రాప్తే మహతి సంకటే
ఛందర్షి దేవతా ధ్యాన - న్యాస ప్రాణాయమా స్తథా
దశవారం జపం కుర్యాత్ — మూలమంత్రస్య యత్నతః

తా॥ జపించుటకై అనేకమంత్రములు నేర్చుకొనిన క్లిష్ట సమయమున మంత్రత్యాగము దరిద్రము కాన వీడుట తగదు, చేయుట అసాధ్యము అయినచో ఆ అధికమంత్రములకు ఛందస్సు, ఋషి, దేవత, ధ్యానము, న్యాసములు, ప్రాణాయామముచేసి ప్రయత్నపూర్వకముగా మూలమంత్రమును పదిమార్లు జపింపవలెను.

శ్లో॥ దేవానా మంగమంత్రాణాం, యథాశక్తి జపస్మృతిః
పునశ్చరణ హోమే తు - న్యాస ధ్యానాదికం క్రమాత్॥
పృథక్ పృథక్ ప్రకుర్వీత -- మూలమం త్రాంగమంత్రయోః॥

తా॥ దేవతల అంగమంత్రములకు యథాశక్తి జపము చేయవలెను. మంత్రపునశ్చరణము, హోమము, న్యాసము, ధ్యానము మున్నగునవి క్రమముగా మూలమంత్ర, అంగమంత్రములకు వేరువేరుగా చేయవలెను.

శ్లో॥ నిత్యహోమం తు మంత్రాణాం ప్రధానస్య మనో ర్మునేః
న్యాసధ్యానాదికం కుర్యా ద్ధోమ మే వాంగమంత్రకే॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! నిత్యహోమము మాత్రము ప్రధాన మంత్రమునకే; అంగమంత్రములకు న్యాసధ్యానాదికమొనర్చి హోమము చేయుటయే.

శ్లో॥ హనుమన్మంత్ర విద్యాసు కాచి ద్గుహ్యా మహామునేః
సప్తమంత్రాత్మకా నామ - సప్తమంత్రమయీ స్మృతా॥

తా॥ హనుమన్మంత్ర విద్యయందు ఒక రహస్యము కలదు. ఓ మైత్రేయ మహామునీ! సప్తమంత్రాత్మకమనగా ఏడుమంత్రములు కలది అని తెలియనగును.

శ్లో॥ సప్తానా మపి మంత్రాణాం - జపో హోమ శ్చ తర్పణం
పృథక్ పృథక్ ప్రకుర్వీత - మాలామంత్రేష్వి వానఘ॥

తా॥ ఓ పాపరహితా! ఏడుమంత్రములకున్ను జప, హోమ, తర్పణములను వేరువేరుగా మాలా మంత్రములందువలె చేయవలెను.

శ్లో॥ భోజనం తు సమష్ట్యేవ - సర్వేషా మథవాంశతః
యథాశ క్త్యనుసారేణ - విత్తశాఠ్యం న కారయేత్॥

తా॥ భోజనము అందఱకు కలిపి సమిష్టిగానే శక్తిననుసరించి ఏర్పాటుచేయవలెను, లేదా కొందఱు కొందఱికి ఒక్కొక్క విభాగముగా ఏర్పాటుచేయవలెను. శక్తియుండికూడ లేనట్లు తక్కువ చేయరాదు.

శ్లో॥ సప్తమంత్రాత్మికా విద్యా పంచానన హనూమతః
ప్రాణాత్యయే పి నో దేయా - యత్కించి ద్ద్విజజన్మని॥

తా॥ పంచముఖాంజనేయుని సప్తమంత్రాత్మిక విద్యను ప్రాణములు పోవుచున్నను ఏ మాత్రపు ద్విజునకైనను ఇచ్చుట తగదు.

శ్లో॥ సౌవర్ణ ముత్తమం ప్రోక్తం - రాజితం మధ్యమం స్మృతం
అధమం తామ్ర మిత్యాహుః - నిష్ఫలం దారువిగ్రహమ్॥

తా॥ విగ్రహములందు బంగరు విగ్రహము ఉత్తమమైనదిగా చెప్పబడినది. వెండితో చేయబడినది మధ్యమము. రాగిది అధమము. కొయ్యతో చేయబడిన విగ్రహము నిష్ప్రయోజనము.

శ్లో॥ సౌవర్ణ రౌప్య శకల - సంమిశ్రా యది తామ్రకం
త దనుత్తమ మిత్యాహుః గుణా స్సంసర్గ సంభవాః

తా॥ బంగారము, వెండి, పలుకులతో కూడిన రాగి విగ్రహమైనచో అది శ్రేష్ఠమైనదిగనే చెప్పుదురు. ఏలన గుణములు ఒకదానితోనొకటి కూడుట వలన ఏర్పడును.

శ్లో॥ శ్వేతార్క విగ్రహం శ్లాఘ్యం కృష్ణాగురుమయ స్తథా
సర్వేషా మాశ్రయాణాం హి సద్య స్సిద్ధికర స్మృతః॥

తా॥ తెల్ల జిల్లేడు విగ్రహము కొనియాడదగినది. అట్లే కృష్ణా గురు నిర్మితమైన విగ్రహము కూడ శ్రేష్ఠమైనది. అది తననాశ్రయించిన వారికి వెంటనే కార్యసిద్ధిననుగ్రహించినదిగా చెప్పుదురు.

శ్లో॥ కదాచి దపి న శ్రేయాన్ - గృహీణాం. దంత విగ్రహః

తా॥ ఇళ్ళయందు దంతముతో చేయబడిన విగ్రహము నుంచుట గృహస్థులకు ఎప్పుడును శ్రేయస్కరము కాదు.

శ్లో॥ నౌకాతరణ వేళాయాం - అశ్వా ద్యారోహణే తథా
శిరసి స్థాపయే ద్దేవం - నౌకాద్యాము తు న నిక్షిపేత్॥

తా॥ ఓడపై దాటు సమయములందు గుఱ్ఱమునెక్కిన వేళలందును దేవుని విగ్రహమును శిరస్సున ధరింపవలెను. నౌకాదులయందు పెట్టరాదు.

శ్లో॥ అవతీర్యత తస్మా ద్వాసంస్కుర్యా త్ప్రతిమాం మునే!
అన్యథా ప్రత్యవాయ స్స్యా ద్దేవో - ప్రతిమాం త్యజేత్॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! ఆ ఓడ, గుఱ్ఱములనుండి దిగిన పిదప సంస్కారమొనర్చవలెను. లేకున్న దోషమేర్పడును. దేవుడే అయినను ఆ ప్రతిమను త్యజింపవలసి వచ్చును.

శ్లో॥ రజోమలిన రూపాసు దేవతాప్రతిమాసు చ
క్షణా ద్గచ్ఛతి సాన్నిధ్యం - దేవతా యాతి సంస్కృతా॥

తా॥ దుమ్ముచే మలినమైన రూపముకల దేవతా విగ్రహములందు క్షణములో సాన్నిధ్యమునుండి దేవతలు వెడలిపోదురు.

శ్లో॥ న జంతుచ్ఛాయయా యుంజ్యా - సజలాద్ర్రితయా సదా
న చ దిగ్వాససా ధీమాన్ - దేవతా ప్రతిమాం శుభామ్॥

తా॥ జంతువులనీడ పడునట్లుగాను, నీటితో తడిసియుండునట్లుగాను విగ్రహముల నెప్పుడు ఉంచరాదు. ఎప్పుడును శుభప్రదములగు దేవతా ప్రతిమలను దిగంబరముగానుంచరాదు.

శ్లో॥ పర్వసు స్నాపయే న్మూర్తిం తామ్రరౌప్య సువర్ణకాం
య ద్యపర్వణి మోహేన సించే ద్భవతి దోషభాక్॥

తా॥ పర్వములయందు ఆ రాగి, వెండి, బంగరు విగ్రహములను స్నానము చేయించవలెను. మోహమున పర్వము కాకున్నను తడిపినచో దోషమగును.

శ్లో॥ తస్మా న్మలినరూపాణాం - మాలిన్య వినివృ త్తయే
సూ క్త్య బృక్షణ గంధాద్యై స్సంస్కుర్యా త్తు యథావిధి॥

తా॥ కావున మలినరూపముకల విగ్రహముల మాలిన్యము తొలగుటకు పురుష సూక్తముతోను, పంచామృతాదులతోను, సంతర్పణ తోను, గంధాదులతోను యథావిధిగా సంస్కారమొనర్చవలెను.

శ్లో॥ మూల మంత్రం సముచ్చార్య- పత్ర పుష్ప ఫలాదిభిః
సర్వదా భ క్తియోగేన – పూజయే త్స్వేష్ట దేవతామ్॥

తా॥ మూలమంత్రమునుచ్చరించి ఎల్లప్పుడును పత్ర పుష్ప,ఫలాదులతో భ క్తియోగమున తన ఇష్ట దైవతమును పూజింపవలెను.

శ్లో॥ త త్పూజనఫలం వక్తుం - న శక్నోతి చతుర్ముఖః
జాపక స్సతణా దేవ - పునశ్చర్యా జపాదికాత్
వాంఛితం ఫల మాప్నోతి – దుర్లభం దేవదానవైః॥

తా॥ ఆ హనుమంతుని విగ్రహమును పూజించుటవలన కల్గు ఫలమును బ్రహ్మకూడ చెప్పజాలడు. జపమొనర్చువాడు మంత్ర పునశ్చరణ వల్ల తక్షణమే దేవదానవులకు కూడ అసాధ్యమైన ఇష్టఫలమును పొందగల్గును.

శ్లో॥ కా ర్తికే మాసి శుద్ధాత్మా - ధాత్రీ పత్రఫలై రపి
సంపూజయే ద్ధనూమంతం – త దానంత్యాయ కల్ప్యతే॥

తా॥ నిష్కల్మష హృదయుడై కార్తీకమాసమున ఉసిరిక పత్రములతోను, ఫలములతోను హనుమంతుని పూజింపవలెను. అట్లు పూజించుట అనంత ఫలితము నిచ్చును.

శ్లో॥ ధాత్రీ ఫలస్థ దీపేన – దేవం నీరాజయే ద్యది
న పశ్యతి తమోలోకాన్ - మహాపాతకవా నపి॥

తా॥ ఉసిరిక పండుపై దీపముంచి శ్రీ హనుమంతునకు కార్తీక మాసమున నీరాజనమిచ్చినచో అతడు మహాపాతకములు చేసినవాడైనను నరకలోకమును చూడడు.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం
పరాశర మైత్రేయసంవాదే
శ్రీ హనుమద్విగ్రహప్రకారకథనం
నామ ద్విషష్టితమః పటలః

# శ్రీ పరాశర సంహితా

## త్రిషష్టితమః పటలః

## హోమప్రకరణం

శ్రీపరాశరః

శ్లో॥ యస్మిన్ దేవే తు యో భక్త - స్సంపూజయతి యో జనః
తద్దేవః పూజిత స్తేన - భక్తి స్తస్యాతినిశ్చలా॥

తా॥ శ్రీపరాశరులవారు చెప్పుచున్నారు. భక్తుడగు జనుడు ఎవడు ఏ దేవుని పూజించునో ఆ దైవము విషయమున అతని భక్తి నిశ్చలమైన దగును. ఆ దైవమాతనిచే పూజింపబడుచుండును.

శ్లో॥ అజ్ఞానా ద్యది వా లోభా - త్తద్భక్తో య ద్యుపేక్షతే
దైవం చాపేక్షితం తేన - స ఏవ భవతి ధ్రువమ్॥

తా॥ అజ్ఞానమువలన కాని, లోభమువలనకాని ఆ భక్తుడు ఉపేక్షించి ఏ దైవతము నపేక్షతో పూజించునో ఆ దైవముగానే అతడు నిశ్చయముగానగును.

శ్లో॥ యస్మిన్ దేవే తు యో భక్తః - మంత్ర స్తస్మా దవాప్యతే
శీఘ్రసిద్ధి ప్రదో మంత్రో - నాభక్తేభ్యః కదాచన॥

తా॥ ఏ దేవుని యందు ఏ భక్తుడు భక్తికలిగియుండునో వాడు ఆ భక్తి కారణముగ మంత్రము పొందగల్గును. భక్తుడు కాని వానికి ఎప్పుడును మంత్రము శీఘ్రసిద్ధి ప్రదము కాజాలదు.

శ్లో॥ యస్య స్వప్నే భవే త్సూర్య చంద్రగహణ దర్శనం
మంత్రసిద్ధి స్తు త స్యాభూ దితి మంత్రవిదో విదుః॥

తా॥ ఎవని స్వప్నమున సూర్య చంద్రగ్రహణ దర్శనము జరుగునో అతనికి మంత్రసిద్ధి యగునని మంత్రవిదులు తెల్పుదురు.

శ్లో॥ మంత్రోపదేశా దుపరి – శుభాశుభ నిరీక్షణం
షణ్మాసే యది జాయే త– పూర్ణే సంవత్సరే యది॥

తా॥ మంత్రోపదేశముపిదప శుభా శుభముల నిరీతిగా గణింపదగును. మంత్రోపదేశానంతరము ఆరు మాసములందేర్పడినను, సంవత్సరము లోపల ఎప్పుడు ఏర్పడినను

శ్లో॥ శుభ దృష్ట్యా తు గృహ్ణీయా దశుభాయాం పరిత్యజేత్
విపర్యయే త్వనిష్ట స్స్యాత్ గృహస్థానాం సుఖైషిణామ్॥

తా॥ శుభమేర్పడినచో స్వీకరింపనగును. అశుభమేర్పడిన యెడల పరిత్యజింపవలెను. సుఖముకోరు గృహస్థులకు అశుభకారణమైనది అష్టనిదాయకమగు మంత్రము.

శ్లో॥ భక్తానాం తు ముముక్షూణాం – వైపరీత్యం తు దోషభాక్
ఇ త్యాగమవిశేషజ్ఞా – ప్రవదంతి మునీశ్వరాః॥

తా॥ భక్తులు ముముక్షువులగువారికి అశుభప్రాప్తియగుట దోషముగా నెంచదగినది. అని ఆగమ విధానమెరిగిన మునీశ్వరులు చెప్పుచున్నారు.

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి –లోకానా ముపకారకం

తా॥ లోకమున కుపకారమగు వేఱొక విశేషమును చెప్పుచున్నాను.

శ్లో॥ శ్వేతార్క-మూలం- శిఖివిష్ణుకాన్తం
గోరోజనం కుంకుమ చందనం చ
ఏతాని చూర్ణాని లలాటపట్టే
త్రైలోక్యవశ్యం మదనావతారమ్॥

తా॥ తెల్లజిల్లెడువేరు, మయూరశిఖి, విష్ణుక్రాంతము, గోరోజనము, కుంకుమ, చందనము, వీటిని చూర్ణముచేసి లలాటమున ధరించిన ముల్లోకములు వశ్యమగు మదనావతారమగును.

శ్లో॥ పుష్యార్కే- శ్వేతగుంజాయాః- విధినా మూల ముద్ధరేత్
ఉలూ కాక్షిణీ మధునా ఖ్యాతం సర్వాంజనం మతమ్॥

తా॥ పుష్యమి నక్షత్రముకల సూర్యోపరాగమందు తెల్లగురివింద వేరును యథావిధిగా తీయవలెను. గుడ్లగూబ కన్నును తెచ్చి తేనెతో మర్దించిన సర్వాంజనమేర్పడును.

శ్లో॥ వృక్ష గుల్మ లతా మూలం - త్వక్పత్రం పుష్ప కాండలం
ఫల మూలాయ మంత్రేణ - హన హన ద్వేష హుం ఫటుమ్॥

తా॥ వృక్షములు, బోదె, తీగె, మూలము, చర్మము, ఆకు, పూవు, కాండము, ఫలము మున్నగునవి ఉద్ధరించునపుడు మూలమంత్రముతో బాటు హనహన, ద్వేష హుం ఫట్ ఇత్యాదుల జేర్చి యుద్ధరింపనగును.

శ్లో॥ స్వాహా యదర్థం దృష్టాపీ - ద్యూతలేన వ్రతం తతః
స్వాగతం తత్ర తత్సిద్ధి -ర్దృష్టాం సర్వ మహౌషధైః॥

తా॥ స్వాహా పల్లవమును కూడ ఉచ్చరించి యుద్ధరింపవలెను. ఏ ప్రయోజనముకొఱకు చూడబడినదో ఆప్రయోజనమునకై స్వాగతము. దానిచే సర్వమహౌషధసిద్ధి చేకూరుగాక.

శ్లో॥ గచ్ఛ గౌతమ శీఘ్రం త్వం గ్రామేషు నగరేషు చ
ఆహా రాసన శయ్యాదీ న్ప్రాశనా న్పరికల్పయేత్॥

తా॥ గౌతమః శీఘ్రముగా గ్రామ నగరములకు వెడలుము. ఆహారాసన శయ్యాదులను ఏర్పరుచుము. అని పలుకవలెనట - (లభించిన పాఠములన్నిట విషయ మస్పష్టము)

ధ్యానం-

శ్లో॥ జూటాబ్జం కలశం మణిం శుక మథోద్య త్తాళ వృంతం సుధా
పాత్రం సాంకుశ పంచసాయక ధనుః పాశం చ వేత్రం కరైః
సాంద్రం వారి విపంచి రత్నకలశాన్ హస్తై ర్వహంతీం భజే
పార్శ్వే ద్విభాం గరుడాసనాం త్రినయనాం శ్రీరాజరాజేశ్వరీం॥

తా॥ పద్మములవంటి జటాజూటముకల్గి కలశము, మణి, శుకము, తాళవృంతము, అమృతకలశము, అంకుశము, చెఱకు విల్లు, పాశము, బెత్తము, సాంద్రోదకము, వీణ, రత్నకలశములను చేతులందు ధరించునట్టి, ప్రకాశమానయగు, గరుడాసనము, త్రినయనయునగు శ్రీరాజరాజేశ్వరీ దేవిని సేవించుచున్నాను.

శ్లో॥ గాయత్రీ యంత్ర మంత్రౌ చ ప్రాణస్థాపన మేవ చ
దిక్పాల భూతబీజాని - యంత్ర స్యాంగాని వైదశ॥

తా॥ గాయత్రి యంత్రము, మంత్రము, ప్రాణప్రతిష్ఠ, దిక్పాలపూజ, భూతశుద్ధి, బీజవిధానము ననునవి పదియంత్రాంగములనబడును.

శ్లో॥ దశధా యో నజానాతి - తస్య యంత్రో నిరర్థకః
సంప్రదాయ విహీనస్య - న మంత్ర స్సిద్ధిదాయకః॥

తా॥ దశవిధములనెవ్వడు తెలిసికొనడో వానికి యంత్రము నిరర్థకము. సంప్రదాయమెరుగనివానికి మంత్రసిద్ధి కలుగదు.

శ్లో॥ మంత్ర స్సద్గురుణాలబ్ధః - సద్య స్సత్ఫలదాయకః

తా॥ సద్గురువుచే పొందబడిన మంత్రము వెంటనే మంచి ఫలితము నిచ్చును.

శ్లో॥ గాయత్రీం యః పరిత్యజ్య - జపే దన్యమనుం బుధః
న మను స్తస్య ఫలదో - నరకం చాధిగచ్ఛతి॥

తా॥ ఎవడైతే గాయత్రినివదిలి అన్య మంత్రములను జపించునో వానికామంత్రము ఫలించదు. ఇంకను అతడు నరకము పొందును.

శ్లో॥ శఠాయ పరశిష్యాయ - దత్వామృత్యు మవాప్నుయాత్
అరి ర్యదా మనో ర్బీజం - అద్యస్యాద్ద్విజసత్తమ॥

తా॥ శఠునకు, ఇతరుల శిష్యునకు మంత్రము నిచ్చిన మృత్యువు నందును. ఎప్పుడైతే మంత్రముయొక్క బీజాక్షరము అరివర్గమై యుండునో అప్పుడు ఓ మైత్రేయా! అది మృత్యు హేతువగును.

శ్లో॥ లక్ష్మీబీజం తథా తారం- మాయా మాద్యం తథా స్మృతః॥
లక్ష్మ్యా సంపత్సమృద్ధి స్స్యాత్ -తారా మోక్షప్రదాయకః

తా॥ మంత్రమునకు మొదట లక్ష్మీబీజము, లేదా తారా, మాయా బీజములు చెప్పబడును. లక్ష్మీ బీజమైనచో సంపత్సమృద్ధినిచ్చును. తారము మోక్షదాయకము.

శ్లో॥ అసాధ్యం సాధయే న్మాయా దితి మంత్రవిదో విదుః
సర్వేషా మేవ మంత్రాణా - మయమేవ వినిశ్చయః॥

తా॥ మాయాబీజము అసాధ్యమును కూడ సాధింపజాలునని మంత్రవేత్తలు చెప్పుదురు. అన్ని మంత్రములకు ఇదియే నిర్ణయము.

శ్లో॥ ప్రణవ ప్లుష్ట బీజానాం సిద్ధారీ న్నైవ శోధయేత్
గృహిణా ముత్తమం ప్రోక్తం - వానప్రస్థస్య మధ్యమమ్॥

తా॥ ప్రణవప్లుష్ట బీజములకు సిద్ధారి స్థాన వివక్ష చేయనవసరములేదు.మంత్రస్వీకారము గృహస్థులకు ఉత్తమముగాను, వానప్రస్థులకు మధ్యమముగను చెప్పబడినది.

శ్లో॥ యతిభ్య శ్చాధమం ప్రోక్తం - నిరర్థం బ్రహ్మచారిణాం
గృహస్థా దేవ హి మనుం ప్రతికుర్వీత గురూత్తమాత్॥

తా। యతులకు మంత్రము అధమము. బ్రహ్మచారులకయినచో నిరర్థకముగా చెప్పబడినది. కాని గురుదేవులకడ మంత్రమును గృహస్థాశ్రమమునుండే స్వీకరింపవలెను.

శ్లో॥ సిద్ధి ర్భవతి వై శీఘ్రం- ఇతి గాలవ భాషితమ్॥

తా॥ ఆరీతిగా నయినచో మంత్రము శీఘ్రముగా సిద్ధించునని గాలవుడు చెప్పెను.

శ్లో॥ గృహస్థేన దీక్షే న్మంత్ర స్తన్మంత్ర శ్శీఘ్రసిద్ధిదః
వానప్రస్తేన యతినా - చిరకాల ఫలప్రదమ్॥

తా॥ గృహస్థునిచే ఉపదేశింపబడిన మంత్రమున శీఘ్రముగా సిద్ధికల్గును. వానప్రస్థునివలనకాని, సన్యాసివలన కాని ఉపదేశమందిన మంత్రము చాలాకాలమునకుకాని ఫలప్రదము కాజాలదు.

శ్లో॥ భక్తానాం చ ముముక్షూణాం నియమో నాస్తి వై మునే

తా॥ ఓ మైత్రేయ మహామునీ! భక్తులకు, మోక్షముకోరి జపించువారలకు ఇట్టి నియమములేదు.

శ్లో॥ ఫలార్థినాం చ జంతూనాం - గృహస్థాదేవ యోగదః॥

తా॥ ప్రయోజనము సాధించుటకై జపించు జనులు గృహస్థుల నుండి స్వీకరించుటయే యోగదాయకము.

శ్లో॥ విధురే న దీక్షే న్మంత్రః - దాంభికే న కదాచన
న గృహ్ణీయా న్న గృహ్ణీయా - ద్వర్జ యే ద్బ్రహ్మచారిణమ్॥

తా॥ భార్య చనిపోయినవానికడ మంత్రము స్వీకరింపరాదు. దాంభికునికడ ఎప్పుడును మంత్ర స్వీకారము చేయరాదు. బ్రహ్మచారికడ ఎప్పటికిని తీసికొనరాదు. అతనిని తప్పక ఆ విషయమున వీడవలెను.

శ్లో॥ అజ్ఞ శ్చాశ్రద్ధధాన శ్చ - సంశయాత్మా వినశ్యతి
తస్మా త్సర్వప్రయత్నేన - విశ్వాసః ఫలదాయకః

తా॥ అజ్ఞుడు, శ్రద్ధలేనివాడు, గురుమంత్రములయెడ సంశయాత్మక బుద్ధికలవాడును నశించును. కావునసర్వప్రయత్నములతోను గురు,మంత్రముల యెడ విశ్వాసము నిల్పుటే ఫలప్రదము.

శ్లో॥ ఆవాహనా ద్యష్టముద్రా — ప్రకారః కథ్యతే మయా

తా॥ ఓ మైత్రేయా! ఇకనాచే ఆవాహనాది అష్టముద్రలు చెప్పబడుచున్నవి.

ఆవాహనాద్యష్టముద్రాః

శ్లో॥ ఉచ్చాంజలి మథః కుర్యా - దియ మావాహనం భవేత్
ఇయం తు విపరీత స్స్యాత్ - తథా వై స్థాపనీ భవేత్॥

తా॥ ఎత్తుగ దోయిలినుంచి తదుపరి దాని నథోముఖమొనర్చిన అది ఆవాహనముద్రయగును. దీనినే విపరీత మొనర్చిన స్థాపనీముద్రయగును.

శ్లో॥ ఊర్ధ్వాంగుష్ఠం ముష్టియుతం — తధేయం సన్నిధాపినీ
అంతరంగుష్ఠ ముష్టిభ్యాం — ముద్రా భవతి ప్రార్థినీ॥

తా॥ అంగుష్ఠములు ఊర్ధ్వముగనుండునటుల ముష్ఠిద్వయము నొకచో చేర్చిన సన్నిధాపినీముద్రయగును. అంగుష్ఠములు లోపల నుండునట్లు పిడికిలి జంటను కలిపి యుంచిన అది ప్రార్థినీ ముద్రయగును.

శ్లో॥ తర్జనీభ్యాం పరిభ్రామ్య — సకలీకరణం భవేత్
అంజలిం చార్ఘ్యవ త్కుర్యాత్ - పరమాకరణం భవేత్॥

తా॥ తర్జనులతో పరిభ్రమణమొనర్చిన సకలీకరణ ముద్రయగును. దోయిలిని అర్ఘ్యమొనర్చునటుల నుంచిన పరమాకరణముద్రయగును.

శ్లో॥ పరివర్త్య కరౌ మంత్రే —తర్జనీ చ కనిష్ఠికే
మధ్య మానామికా యుగ్మే - స్థాపయే త్తు పరస్పరమ్
అమృతీకరణం నామ - ముద్రేయం ధేనురూపిణీ॥

తా॥ హస్తములను మంత్రోచ్చారణ మొనర్చుచు పరివర్తనముచేసి తర్జనీ కనిష్ఠికలను మధ్యమ అనామికాంగుళి ద్వయముతో చేర్చిన అది ధేను రూపిణియగు అమృతీకరణమను పేరుగల ముద్రయగును.

శ్లో॥ ఏతా స్సాధారణా ముద్రాః - దర్శయిత్వా జపే న్మనుమ్

తా॥ ఈ సాధారణ ముద్రలను చూపి మంత్రమును జపింపనగును.

## అర్చనక్రమం

వ॥ ఆద్యో౽గ్ని రుద్ర గ్రహ నేత్ర వేద మార్తాండ దిగృతు
దిగ్గజ షోడషేషు మన్వంతరే బాణతురంగ
వాసరా స్త్రి యోదశా స్స్యు స్స్వర వర్ణ మాలిఖేత్॥

తా॥ ఆద్య-1; అగ్ని-3; రుద్ర-11; గ్రహ-9; నేత్ర-2; వేద-4; మార్తాండ-12; దిక్-10; ఋతు-6; దిగ్గజ-8; షోడశ-16; మన్వంతర-14; బాణ-5; తురంగ-7; వాసర-15; త్రియోదశ-13;

శ్లో॥ అకారాది క్షకారాంతం - విలిఖేత్ షోడశకోష్ఠకే
సిద్ధారీ న్కల్పయే న్మంత్రం - కుర్యా చ్ఛిద్ధారిభిః పునః॥

తా॥ అకారాది క్షకారాంతము పదునారు కోష్ఠములందు లిఖింపవలెను. సిద్ధారి విభాగ కల్పనచేసి మంత్రమున సిద్ధారి భేదములతో విభాగము గావింపవలెను.

శ్లో॥ స్వ నామ వర్ణ మారభ్య - యావ న్మంత్రార్ణ దర్శనం
గణయే త్షోడశే కోష్ఠే సిద్ధారీం శ్చ విచింతితః॥

తా॥ తనపేరునందలి అక్షరమును మొదలుకొని ఏంతవఱకు మంత్రార్ణ స్వరూపముండునో అంతవఱకు సిద్ధారి విభాగమొనర్చుచు పదునారు కోష్ఠములందును లెక్కింపవలెను.

శ్లో॥ సిద్ధా౽సిద్ధ సూక్తజపా త్సాధ్యమంత్రో నిరర్థకః
సుసిద్ధప్రాప్తి మాత్రేణ - సాధకం భక్షయే దతః॥

తా॥ సిద్ధా సిద్ధ సూక్త జపముకన్న సాధ్య మంత్రము నిరర్థకము. కేవల సుసిద్ధ మాత్రమయినచో అది సాధకుని భక్షించును.

శ్లో॥ ద్విగుణ స్సాధ్యసిద్ధ స్తు - సాధ్యాసా ధ్యేనిరర్థకః
సాధ్య స్సుసిద్ధార్థజపా - స్సిద్ధారి శ్రియం హరేత్॥

తా॥ సిద్ధసాధ్యమగు మంత్రము రెట్టింపు ఫలితమిచ్చును. సాధ్య, అసాధ్యమయినచో అది నిష్ప్రయోజనము. సాధ్య, సుసిద్ధము సిద్ధారియును సంపదలను హరించును.

శ్లో॥ అరిసిద్ధం సుతం హన్యా - దరిసాధ్య స్తు కన్యకాం
పత్నీ మథారిసిద్ధ స్తు - ఆత్మానం హం త్యరీవరః॥

తా॥ అరిసిద్ధము పుత్రుని చంపును. అరి సాధ్యము పుత్రీనాశ కరము. అరిసిద్ధము పత్నినాశకరము కేవల అరిస్థానము తననే చంపును.

శ్లో॥ ఉక్త ద్విపాదబంధుఘ్నం-ద్విర్నిందార్థ గోత్రహం
అర్థోక్త పాదజాతిఘ్నం - పుత్ర క న్యాంగనాత్మహా॥

తా॥ రెండు పాదములుచెప్పిన బంధువుల చంపును. రెండునిందార్థ ములున్నచో వంశనాశనము చేయును. అర్థోక్తముగచెప్పిన పాదము జాతిని, పుత్ర, పుత్రీ, భార్యదులను, తననుకూడ నాశనమొనర్చును.

శ్లో॥ దేశే గ్రామే గురే భూపే మంత్రే చౌషధ దైవతే
నామవర్ణా న్నిగణయే దక్షరా న్సరితః క్రమాత్॥

తా॥ దేశము, గ్రామము, గురువు, రాజు, ఔషధము, దైవతము లందు మంత్రమును గూర్చి నామవర్ణములను క్రమముగ లెక్కింపవలెను.

శ్లో॥ ఉత్తమం హోమజాప్యం చ - పూజాజాప్యం చ మధ్యమం
అథమం మాలికాజాప్య మితి శాతాతపో ఒబ్రవీత్॥

తా॥ హోమరూపమైన జపమును ఉత్తమమైనదిగను, పూజావిధి పూర్వక జపమును మధ్యమముగను, మాలికాజపమును అధమముగను శాతాతపుడు పల్కెను.

శ్లో॥ యతీనాం బ్రహ్మచారీణాం - నారీణాం చ విశేషతః
జపమాత్రేణ సిద్ధి స్స్యా - ద్వినా హోమం చ తర్పణమ్.

తా॥ సన్యాసులకు, బ్రహ్మచారులకు, విశేషించి స్త్రీలకు జప మాత్రముచేతనే మంత్రసిద్ధియగును. హోమ తర్పణములవసరము లేదు.

శ్లో॥ గురువిశ్వాసమాత్రేణ తన్మంత్ర స్సిద్ధ్యతి ధ్రువమ్.

తా॥ గురువునందు విశ్వాసముంచి జపించిన మాత్రముననే తప్పక వానికి మంత్రసిద్ధి కల్గును.

శ్లో॥ అన్య ద్రహస్యం వక్ష్యామి - మైత్రేయ శృణు తత్త్వతః
లోకోపకారకం గోప్యం - శృణ్వతాం పుణ్యవర్ధనమ్।

తా॥ ఓ మైత్రేయా! వేరొక రహస్య విషయమును చెప్పుచున్నాను. శ్రద్ధగా వినవలసినది. లోకమునకు ఉపకారకారియైనది, వినుట వలననే పుణ్యమును పెంపొందజేయునది యగు ఈ విషయము గోపనీయము.

శ్లో॥ పురశ్చరణకృ న్మర్త్యో- కామ్యకర్మాణి కారయేత్
అగ్నిమంథం తతః కృత్వా యథాశాస్త్ర సునిశ్చితమ్॥

తా॥ పురశ్చరణమొనర్చు మనుష్యుడు కామ్యకర్మల నాచరింపవలెను శాస్త్రోక్త విధానము ననుసరించి అగ్ని మథనము కావింపవలెను.

శ్లో॥ విశ్వాసాస్తిక్య సంయుక్తః - పూజయిత్వా వినాయకః
అపూపై ర్మోదకై శ్చైవ - ఫలత్రయ సమన్వితైః
విఘ్నేశం పూజయే న్మంత్రీ - సర్వవిఘ్నోపశాంతయే

తా॥ నమ్మకంతోను, ఆస్తికబుద్ధితోను వినాయకునిపూజించి విఘ్నములన్నియు తొలగుటకొఱకై మూడుపండ్లు, కుడుములు కలిగియున్న పిండివంటలను నివేదనమొనర్చవలెను.

శ్లో॥ దుర్గాం చైవ మహాభాగాం -వరదాం సర్వసిద్ధయే
సంపూజ్య భక్ష్యభోజ్యాద్యైః - తతః కర్మాణి కారయేత్॥

తా॥ పూజ్యురాలు, వరములొసంగునట్టిదియగు దుర్గామాతను కూడ సర్వసిద్ధికై భక్ష్యభోజ్యాదులతో పూజించి అనంతరము వలయు కర్మల నాచరింపవలెను.

శ్లో॥ పూర్వరాత్రౌ బలిం దత్వా – ప్రభాతే హోమ మాచరేత్
ప్రీహిభి ర్వ్రీహికామ స్తు – పయసా పశు మాప్నుయాత్॥

తా॥ పూర్వరాత్రియందు బలినొసంగి ప్రభాతసమయమున హోమమునాచరింపవలెను. ధాన్య సంపద కోరువాడు వడ్లు హోమము చేయవలెను. పశుసంపద కోరువాడు పాలతో హోమము చేయవలెను.

శ్లో॥ ఆజ్యేన పుష్టి ర్ద్వేశం – ఇక్షుఖండై శ్చ వశ్యకం
కన్యార్థీ లాజహోమేన పుత్రార్థీ కుముదై ర్నవైః

తా॥ పౌష్టిక కాంక్ష కలవాడు నేతితోను, వశీకరణముకోరువాడు చెఱుకుముక్కలతోను, కన్యనుకోరువాడు పేలాలతోను పుత్రులను కోరువాడు తెల్లకలువలతోను హోమము నాచరింపలెను.

శ్లో॥ తిలతండుల హోమేన – ధన ధాన్యం ప్రయచ్ఛతి
బిల్వహోమేన రాజ్యశ్రీ – రపూపై ర్నవపుత్రకమ్॥

తా॥ నువ్వులు, బియ్యము హోమము చేయుట వలన ధనధాన్య సమృద్ధి కల్గును. మారేడు దళములతో హోమమాచరించుటవలన రాజ్య సంపద చేకూరును. అప్పములతో హోమమొనర్చుట వలన తొమ్మిది మంది పుత్రులు కల్గుదురు,

శ్లో॥ బ్రాహ్మవర్చసకామ స్తు – పాలాశసమిధై ర్హునేత్
స్త్రీవశ్యం లవణే చైవ – వృష్టికామ స్తు వేతసైః

తా॥ బ్రహ్మవర్చస్సును కోరువాడు మోదుగపుల్లలతో హోమము చేయవలెను. స్త్రీవశ్యము కాంక్షించువాడు ఉప్పుతోను, వర్షమును కోరువాడు ప్రబ్బలితోను హోమము గావింపవలెను.

శ్లో॥ శత్రుపక్ష వినాశే తు – విభీతకసమిద్ధునేత్
పిచుమందై స్తథా కుర్యా – చ్ఛత్రునాశాయ మంత్రవిత్॥

తా॥ శత్రుపక్షము వినాశమందుటకై విభీతక సమిధలతో హోమము చేయవలెను. పాచికలను తయారుచేసెడి తాండ్రచెట్టునే విభీతక మందురు. శత్రువులు నశించుటకై మంత్రవేత్తయగువాడు వేపసమిధలతో హోమము చేయవలెను.

శ్లో॥ రాజానుగ్రహ మన్విచ్ఛన్ - మధుహోమం తు కారయేత్

తా॥ రాజానుగ్రహము కాంక్షించువాడు తేనెతో హోమము నానర్చవలెను.

శ్లో॥ భుంజానః ప్రథమం పిండం - యస్య నామ్నా ఒభిమంత్రితః
స ప్తక్సృ త్నో పయః స్నిగ్ధం - సోఽపి వశ్యో గమిష్యతి॥

తా॥ ఎవరిపేరుతో అభిమంత్రింపబడిన మొదటి పిండమును పాలతో తడిసినదానిని అగ్నిదేవుడు ఆరగించునో వాడు మంత్రవేత్తకు వశ్యుడగును.

శ్లో॥ యద్యత్పదార్థ హోమే న - తత్తత్ప్రాప్నో త్యసంశయః

తా॥ ఏఏ పదార్థముతో హోమము చేయుదురో ఆయా సంపద నిస్సందేహముగా చేకూరును.

శ్లో॥ రోగా నశ్యంతి చాత్యర్థం - తస్య రోగస్య భేషజం
హోమయేద్ధ విధి ర్యస్య - తస్యరోగో వినశ్యతి॥

తా॥ ఈ హోమమువలన రోగములుకూడ బాగుగా నశించును. ఈ హోమమే అది ఆచరించువానికి ఔషధము. ఎవనిహవిస్సుచే హోమము చేయబడునో అతని రోగము నశించును.

శ్లో॥ నిత్య మన్నేన హోతవ్యం - ధనధాన్య సమృద్ధయే
జపా చ్ఛ్రేష్ఠతరం చైవ - తర్పణం చ తతఃపరమ్

తా॥ ధనధాన్య సమృద్ధి కొఱకై ప్రతిదినమునను అన్నముతో హోమము చేయవలెను. జపమునకు పిదప తర్పణము శ్రేష్ఠతరము.

శ్లో॥ జపస్యాంతేన దేవేశి! హోమం కుర్యా ద్విశేషతః
మంత్రశుద్ధి స్తు కుర్వీత - తస్య శాంత్యర్థ మాత్మన॥

తా॥ పార్వతీ! జపమునకు పిదప విశేషముగా హోమము నాచరింప వలెను. ఆత్మశాంతి కొఱకై మంత్రశుద్ధి నొనర్చవలెను. ఈ విషయ ములు శివునిచే పార్వతికి చెప్పబడినట్లు తెలియదగును.

శ్లో॥ నిష్కళంకం నవం కుంభం - శుద్ధతోయేన పూర్ణయేత్
అష్టోత్తర సహస్రేణ - సంస్కృతం బలిపూర్వకమ్॥

తా॥ ఏ కళంకము లేనట్టిది, క్రొత్తది అయిన కుండనుతెచ్చి మంచినీటితో నింపవలెను. బలిపూర్వకముగ అష్టోత్తర సహస్రముతో దానిని సంస్కరింపవలెను.

శ్లో॥ తే నాభిషేకం కుర్యాత్ - మాసే మాసే చ బుద్ధిమాన్
గృహక్షేత్రాదికం చైవ - ఆరామం దేవతాలయమ్॥

తా॥ బుద్ధిమంతుడగువాడు అట్లు ఆ జలముతో గృహక్షేత్రాదిక మును, దేవాలయ మంటపములను ప్రతి మాసమునందు అభిషేకము గావింపవలెను.

శ్లో॥ ప్రాసాదం దేవదేవేశి పిశాచాది విభూషితం
కృత్యా దిభి శ్చదుష్టై శ్చ - మంత్ర ధ్యాన పరాయణః॥

తా॥ ఓ పార్వతీ? ఏఏప్రదేశములు పిశాచాదులు ఆవరించి యుండునో, దుష్ట కృత్యములు జరిగియుండునో అట్టిచోటను, మంత్ర ధ్యాన పరాయణుడగువాడు

శ్లో॥ యత్ర యత్ర మహాదేవి వేశిక శ్చ ధృతాసనః
మృగ వ్యాఘ్రాసనతలో - తిలహోమంతు కారయేత్
అయుతం వా సహస్రం వా. ఏత ద్దోషస్య నాశనమ్॥

తా॥ ఓ మహాదేవీ! ఎక్కడెక్కడ నిలయమో, ఆసనముకలదో, జింక చర్మము, వ్యాఘ్ర చర్మమువంటి ఆసనము నేర్పరచునో అక్కడ క్కడ పదివేలుకాని, వేయి పర్యాయములుకాని నువ్వులతో హోమము చేయవలెను. అట్లు చేయుటవలన దోషములు నశించును.

శ్లో॥ తావ ద్భజేత కల్యాణి - దశరాత్రం తతః పరం
అజం హత్వా బలిం దత్వా - చార్ధ రాత్రం చ రాజసమ్॥

తా॥ అటు పిమ్మట పదిరాత్రులు అట్లుండవలెను. పిదప అర్ధరాత్రమున మేకతో రాజసబలినీయవలెను.

శ్లో॥ తత్రైవ నివసేన్మంత్రీ — మౌన ధ్యాన పరాయణః
మాతృకాన్యాస సంయుక్తః — మాంత్రిన్యాస సమన్వితః

తా॥ అనంతరము మౌనధ్యానపరాయణుడై మాతృకాన్యాస మొనర్చిమంత్రన్యాసాదికముతో కూడిన వాడై మంత్రవేత్తయగువాడు అచ్చటనే వసింపవలెను.

శ్లో॥ క్షేత్రవంతం గణైస్సార్థం — సర్వదోష నికృంతనం
సాన్నిధ్యం కురుతే తస్య — సర్వశాంతిః ప్రయచ్ఛతి॥

తా॥ ఆరీతిగా దేవగణములతో కూడిన సర్వదోషములు తొలగిన క్షేత్రసాన్నిధ్యమా మంత్రవేత్తకు కల్గి సర్వశాంతి చేకూరును.

శ్లో॥ తతః ప్రాత స్సముత్థాయ — స్నాత్వా ధౌతాంబర శ్శుచిః
బ్రాహ్మణై ర్గుణసంపన్నైః — హనుమద్ధ్యాన తత్పరః
పుణ్యాహం వాచయిత్వా తు — ప్రోక్షయే త్సర్వభూతలమ్॥

తా॥ పిదప ఉదయమునేలేచి స్నానమొనర్చి శుచియై ఉతికిన వస్త్రముల ధరించి హనుమంతుని ధ్యానించుచు సద్గుణవంతులగు బ్రాహ్మణులతో కూడి పుణ్యాహవాచన మొనర్చి అభూప్రదేశమునంతను ప్రోక్షణయొనర్చవలెను.

శ్లో॥ రాజ్ఞా మేవం తు కార్యా చ — మహతీ దక్షిణా ప్రియే!
ఆపదుద్ధారసిద్ధిస్తు — సాక్షా త్త్రైలోక్య నాయకః
యత్రయత్ర వశే న్మూర్తిః — తత్రతత్ర సమృద్ధయః

తా॥ ఓ పార్వతీ! రాజులు ఈ రీతిగానే ఆచరించి భూరిదక్షిణలీయవలెను. అట్లుచేయుటవలన వారికి ఆపదుద్ధారసిద్ధియేర్పడుట, సాక్షాత్తు

ముల్లోకముల నాయకత్వము చేకూరును. ఎచ్చటెచ్చట హనుమన్మూర్తి యుండునో అచ్చటచ్చట సర్వసమృద్ధులు ఉండును.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయసంవాదే
హోమప్రకారకథనంనామ త్రిషష్టితమః పటలః

# శ్రీ పరాశర సంహితా

## చతుష్షష్టితమః పటలః

### రాజాభిషేక కథనం

శ్రీ పరాశరః-

శ్లో॥ అధాన్య దపి వక్ష్యామి - రాజ్ఞాం రక్షాకరం పరం
అత్ర మంగళవారం తు - భస్మయోగం తు కారయేత్॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు, ఓ మైత్రేయ మహాముని! ఇక వేరొక విషయమును చెప్పుచున్నాను. అది రాజులకు మిక్కిలి క్షేమదాయకమైనది. ఈ విషయమున మంగళవారమున భస్మయోగము చేయవలెను.

శ్లో॥ అపతితం గోమయం గ్రాహ్యం - శుచి ర్భూత్వా యథావిధి
అశ్వత్థౌ దుంబర ప్లక్ష - న్యగ్రోధ శ్చ చతుష్టయమ్॥

తా॥ నేలమీద పడకుండగనే శుచియగువాడు యథావిధిగా గోమయమును తీసికొనిరావలెను. రావి, మేడి, జువ్వి, మఱ్ఱి అను ఈ నాల్గిటిని

శ్లో॥ త్వచా సంగృహ్య మతిమా -నుశీరం కృష్ణచందనమ్॥
కర్పూరం కుంకుమం దేవి - బిల్వమూలం తతః పరమ్॥

తా॥ తోలూడకుండగతెచ్చి బుద్ధిశాలియగువాడు వట్టివేరు, కృష్ణ చందనము, కర్పూరము, కుంకుమ, మారేడు మూలములను

శ్లో॥ వారాహీం చ కురువేరు - శ్వేతార్కస్యమూలకం
ఏతాని చూర్ణయిత్వా తు -గోమయేన తు పేషయేత్॥

తా॥ నేలతాడి, కురువేరు, తెల్లజిల్లేడువేరు, వీనిని చూర్ణముచేసి ఆవుపేడతో నూఱవలెను.

శ్లో॥ తత్పిష్టం దీపసంస్కార - సంస్కృతేన చ వహ్నినా
దగ్ధ్వా విభూతిం సంగృహ్య -భాజనే గంధవాసితే॥

తా॥ ఆ ముద్దను దీప సంస్కారముతో కాల్చి విభూదినిచే తీసికొని సువాసన కల పాత్రయందుంచనగును.

శ్లో॥ అభిమంత్ర్యాష్టసాహస్రం - మంత్రధ్యాన పరాయణః
ఆపదుద్ధార మంత్రేణ - దద్యా ద్రక్షాం దినేదినే॥

తా॥ మంత్రధ్యాన తత్పరుడగువాడు మంత్రముతో ఎనిమిదివేల పర్యాయములు మంత్రించి ప్రతిరోజు ఆపదుద్ధారక మంత్రముతో రక్షణ గూర్చవలెను.

శ్లో॥ తద్భస్మం ధారయే దేవం - కాంతిలక్ష్మీ ద్యుతి స్తథా
బలం ప్రజ్ఞావశత్వేన - ఆయురారోగ్య మేవ చ॥

తా॥ ఈ రీతిగా ఆ భస్మమును కాంతి కొఱకై ధరింపవలెను. అట్లు ధరించుటచే కాంతి, బలము, ప్రజ్ఞ, వశత్వము, ఆయువు, ఆరోగ్యము కల్గును.

శ్లో॥ అశక్తా వపి శక్తి స్స్యాత్ - తస్మా ద్యత్నేన ధారయేత్

తా॥ దీనిచే అశక్తునకు శక్తి కల్గును. కాన ప్రయత్న పూర్వకముగ దీనిని ధరింపవలెను.

శ్లో॥ శయ్యాగృహే తథా కుర్యా - దుపవిష్ట స్తు బుద్ధిమాన్
భూత వృశ్చిక సర్పాద్యా - పలాయంతే చ దూరతః॥

తా॥ ఈరీతిగానే బుద్ధిమంతుడు శయ్యాగృహమునందును చేయదగును. అట్లు చేయుటవలన భూతప్రేతాదులు, తేళ్ళు, పాములు, మొదలగునవన్నియు దూరముగా పారిపోవును.

శ్లో॥ మంత్రం సంగృహ్య సిద్ధస్సన్ - స్నేహా ద్యత్నేద రక్షయేత్
బ్రాహ్మణో మంత్రసంసిద్ధేః - నిత్యం కుర్యా త్తు సాత్వికమ్॥

తా॥ మంత్రము పొంది మంత్రసిద్ధినందినవాడు స్నేహభావముతో దానిని ప్రయత్న పూర్వకముగా రక్షించవలెను. మంత్రసిద్ధికై బ్రాహ్మణుడు సాత్విక మంత్రమును నిత్యము జపించవలెను.

శ్లో॥ అతఃపరం ప్రవక్ష్యామి - అభిషేకం సుదుర్లభం
రాజ్ఞాం హితకరం పుణ్యం - శాంతి పుష్టి వివర్ధనమ్॥

తా॥ అటుపిమ్మట దుర్లభమగు అభిషేక విధానమును చెప్పుచున్నాను. అది రాజులకు మేలుకూర్చునది, శాంతిని, పుష్టిని పెంపొందించునదియు.

శ్లో॥ మహాపాప ప్రశమనం - మహారోగ భయాపహం
బ్రహ్మహత్యాది శమనం - అభిచార నివారణమ్॥

తా॥ ఇంకను మహాపాపములను పోగొట్టజాలినది, మహారోగముల భయమును తొలగించునది, బ్రహ్మహత్యాది పాతకముల పోగొట్టునది ఇతరులు తనను హింసించుటకై చేయు కర్మలను అణచునది.

శ్లో॥ శత్రుక్షయకరం దేవి! - మాసేమాసే సమాచరేత్
ఆపదుద్ధార మంత్రజ్ఞం - బ్రాహ్మణం శాన్తిమానసమ్॥

తా॥ శత్రువులను నాశనమొనర్చునది. దీనిని ప్రతి మాసమునందు ఆచరింపవలెను. ఆపదుద్ధారక మంత్ర మెఱిగినట్టియు, శాంతచిత్తుడైన బ్రాహ్మణుని

శ్లో॥ ప్రార్థయే దభిషేకం చ - దుర్లభం త్రిదశై రపి
సర్వశాస్త్ర సముద్ధారం - దధ్నా ఘృతమి వోద్ధతమ్॥

తా॥ సర్వశాస్త్రములచే ఉద్ధరింపబడి పెరుగునుండి నేయి వెలువడునట్లు వెలువడినది, దేవతలకు కూడ దుర్లభమైనదియగు అభిషేకమును ప్రార్థించవలెను.

శ్లో॥ ప్రార్థితో మంత్రసంసిద్ధో - నిత్యం జపపరాయణః
కుర్యాన్మహాభిషేకం చ - శుభనక్షత్రకే తథా॥
అభిషేక ప్రయోగజ్ఞః - మంత్రసంయుతమానసః॥

తా॥ అట్లు ప్రార్థింపబడిన వాడై మంత్రసంసిద్ధుడు, నిత్యము జప పరాయణుడై యుండువాడు అగు బ్రాహ్మణుడు శుభనక్షత్రమందు ఆ మహాభిషేకమును అభిషేక ప్రయోగమెఱిగి మంత్రములతో కూడిన మనస్సు కలవాడై చేయవలెను.

శ్లో॥ చతుస్తోరణ పర్యంతే - కల్పయేన్మండలం తథా
వితానం దర్భమాలాభి - రలంకృత పరిచ్ఛదమ్॥

తా॥ నాలుగువైపుల ద్వారముల నేర్పరచిన ప్రదేశమున మండలాకార మేర్పరుపవలెను. అచ్చట దర్భమాలలతో అలంకరించినటుల కప్పవలెను.

శ్లో॥ తస్య మధ్యే మహాదేవి! రోమలోష్ట వివర్జితం
కృత్వా తత్ర వికీర్యాథ - అష్టద్రోణైశ్చ శాలిభిః॥

తా॥ ఆ మధ్యప్రదేశమున వెంట్రుకలు, మట్టిగడ్డలు వంటివి లేకుండ చేసి ఎనిమిది దొన్నెల నేర్పరచి శాలిధాన్యమును చల్లవలెను.

శ్లో॥ తత్ర కృత్వా మహాపద్మం - అష్టపత్రం సకర్ణికం
శక్తిత్రయ సమాయుక్తం - అష్టభైరవ సంయుతమ్॥

తా॥ అచ్చట ఎనిమిదిరేకులు, బొడ్డుకలిగిన మహాపద్మము నేర్పాటు చేయవలెను. ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహ శక్తులతో శక్తిత్రయముతో కూడిన, అష్టభైరవులతో కూడిన—అష్టభైరవులు

1. విద్యారాజ, 2. కామరాజ, 3. నాగరాజ, 4. స్వచ్ఛందరాజ, 5. లంబితరాజ. 6. దేవరాజ, 7, ఉగ్రరాజ, 8. విఘ్నరాజులను అష్టభైరవులందురు.

శ్లో॥ తత్త ద్బీజేన దేవేశి - తస్య పీఠం ప్రపూజయేత్
తద్బాహ్యే కోణపాలాంశ్చ - తత్తద్బీజేన పూజయేత్॥

తా॥ ఆయా బీజాక్షరములతో ఆ పీఠమును పూజింపవలెను. దానికి బాహ్యమున కోణపాలకులను కూడా ఆయా బీజాక్షరములతో పూజింపవలెను.

శ్లో॥ తద్బాహ్యే మాతృకావర్ణం - తత్తన్నామ్నా చ పూజయేత్
తద్బాహ్యే రుద్రయుక్తాం తు - మాతృకాం విన్యసే ద్బుధః॥

తా॥ దానికి బాహ్యమున మాతృకావర్ణమును ఆయా నామముతో పూజింపవలెను. దానికి బాహ్యమున రుద్రయుక్తముగ మాతృకా విన్యాసమొనర్చవలెను.

శ్లో॥ ఏవం క్రమేణ దేవేశి - పంచావరణ ముచ్యతే
చక్రస్య సర్వతో బాహ్యే - దక్షిణేన వినాయకమ్।

తా॥ ఈరీతిగా క్రమేణ పంచావరణము చెప్పబడుచున్నది. చక్రమునకు సర్వతః బాహ్యమున దక్షిణముగా వినాయకుని,

శ్లో॥ ఉత్తరే తు యథా దుర్గాం - పూజయే ద్దేశికోత్తమః
ఏవం పూజావిధానేన - తత్తత్ స్థానేషు దేవతాః॥

తా॥ ఉత్తరభాగమున దుర్గను పూజింపవలెను. ఈ రీతిగా ఆయా స్థానములందు ఆయా దేవతలను పూజావిధానము ననుసరించి అరాధింపవలెను.

శ్లో॥ తత స్తు విన్యసేత్ సాధ్యాన్ - సాపిధానాన్ సకూర్చకాన్
పుష్పాక్షత సమాయుక్తాన్ - తిల చందన సంయుతాన్॥

తా॥ పిమ్మట వస్త్రమును ధరించియున్నటువంటి, దర్భ పిడికిలి కలిగి యున్నటువంటి, పుష్పములు, అక్షతలతోను, నువ్వులు, చందనములతో కూడియున్నటువంటి సాధ్య గణదేవతలను విన్యసింపవలెను.

శ్లో॥ అశీతిసంఖ్యా కలశాన్ - తోయపూర్ణాన్ యథావిధి
తత్త ద్దేవ సమాయుక్తాన్ - అర్చయే న్మంత్రవిత్తమః॥

తా॥ మంత్రవేత్తయగువాడు ఉదకముతోనిండి ఆయా దేవతలతో కూడియున్న ఎనుబది కలశములను యథావిధిగ పూజింపవలెను.

శ్లో॥ చక్రమధ్యే మహాకుంభం - సౌవర్ణం రాజతం తథా
మృణ్మయం వా యథా పిష్టం - కుంభం కుంభ మలంకృతమ్॥

తా॥ చక్రమధ్యమున బంగారపు, వెండి మహాకుంభములను మట్టితోకాని, పిండితోకాని చేసిన వానినుంచి కుంభము కుంభముగా అలంకరించ వలెను.

శ్లో॥ సూత్రేణ వేష్టనం కుర్యాత్ శుద్ధతోయేన పూరయేత్
నవరత్నాని తత్రైవ - పుష్పాణి చ శుభాని చ॥

తా॥ దారముచుట్టి వానిని శుద్ధజలముతో నింపవలెను. వానియందు నవరత్నములను, శుభప్రదములైన పూవులను

శ్లో॥ అక్షతాం శ్చైవ నిక్షిప్య - క్షీరవృక్ష చతుష్టయం
లక్ష్మీం దుర్వా సహాదేవీం - బిల్వం కర్పూరచందనమ్॥

తా॥ అక్షతలనుకూడ అందువైచి, రావి, మేడి, మఱ్ఱి, జువ్వి మున్నగు నాల్గు వృక్షములను, ప్రేంకణము, గటిక, సహదేవి, మారేడు, కర్పూర, చందనములను,

శ్లో॥ ఉశీరం కుంకుమం చైవ - తక్కోలాగురుసంయుతం
చంపకం మల్లికా జాజి - గోమేధం తామ్రకం తథా॥

తా॥ వట్టివేరు, కుంకుమ, తక్కోలము, అగురులతో కూడిన సంపెంగ, మల్లి, జాజి, గోమేధము, తామ్రకము.

శ్లో॥ కుంభమధ్యే వినిక్షిప్య - సాపిధానం సకూర్చకం
దుకూలయుగ్మ సంఛన్నం - దేవస్య హృదయంగమమ్॥

తా॥ ఆ కుంభముల మధ్యననుంచి వస్త్రముకప్పియున్నట్టి, దర్భ ముష్టికల్గియున్నట్టి దువ్వలువలజంటచే కప్పబడినట్టిదిగా దేవునకు ఇష్టమైనట్టిదిగా

శ్లో॥ కృత్వా మంత్రవిధానేన – వ్యాఘ్రచర్మాసనస్థితః
కుంభమధ్యే మహాదేవం – ఆపదుద్ధారణాహ్వయమ్॥

తా॥ మంత్రవిధానముచేసి పులిచర్మము ఆసనముగా కూర్చున్నవాడై ఆకుంభమధ్యమున ఆపదుద్ధారక నామముకల మహాదేవుని

శ్లో॥ జ్వలద్దంష్ట్రిం సుభీమం చ – అగ్నిత్రయని భేక్షణం
ఊర్ధ్వకేశం మహాఘోరం – చంద్రరేఖా విరాజితమ్॥

తా॥ ప్రకాశించుచున్న కోరలుకలవానిని, భయంకరమైనవానిని, త్రేతాగ్నులతో సమానమైన నేత్రములు కలవానిని, ఆకసమున వ్యాపించిన కేశజాలము కలవానిని, మిక్కిలి ఘోరముగ నున్నవానిని, చంద్రరేఖతో ప్రకాశించువానిని

శ్లో॥ మహానాగకృతే నైవ – దంతవక్త్రేణ శోభితం
చతుర్బాహు ముదారాంగం – నాగయజ్ఞోపవీతినమ్॥

తా॥ గొప్ప ఏనుగుచర్మముతోను, దంతవక్త్రముతోను ప్రకాశించు వానిని, నాల్గుబాహువులు కలవానిని, గొప్ప అవయవములు కలవానిని, పాముజందెముగా కలవానిని,

శ్లో॥ హార కేయూర సంఛన్నం – శతనాగ విభూషితం
నూపురధ్వని సంయుక్తం – సర్వకర్మ నికృంతనమ్॥

తా॥ హారములతోను, బాహుపురితోను చుట్టబడిన వాడును, నూరు సర్పముల నాభరణములుగా ధరించినవానిని, నూపురధ్వనితో కూడియుండు వానిని, సర్వకర్మబంధములను ఛేధించువానిని

శ్లో॥ తస్మా ద్వ్యాఘ్రసమాయుక్తం – ధ్యాయే చ్ఛ హనుమత్ప్రభుః
రాత్రౌ రాజ్ఞా విశేష శ్చ – వ్యాఘ్రచర్మాణి సంశ్రయేత్॥

తా॥ వ్యాఘ్ర చర్మమున ఆ హనుమత్ప్రభువును ధ్యానము చేయ వలెను. రాత్రి యందు రాజు విశేషముగ పులి చర్మము నాశ్రయింప వలెను.

శ్లో॥ ఏవంరూపం సమాపోహ్య - ధ్యానయుక్తం జపే ద్ద్విజః
అయుతం లక్షణోపేతం - మాతృకాన్యాస సంయుతమ్॥

తా॥ ఇట్టిరూపము నూహించుచు ద్విజుడు, సలక్షణముగా మాతృకా న్యాసపూర్వకముగా ధ్యానయుక్తముగా పదివేలు జపించవలెను.

శ్లో॥ ఘట స్యేశాన్యది గ్భాగే - చతురశ్రం తు కారయేత్
నాభి యోని సమాయుక్త - కుండే మంత్ర సమాహితః॥

తా॥ కలశమునకు ఈశాన్యదిగ్భాగమున చతురశ్రము గీయవలెను. మంత్రముతో కూడినవాడై నాభియోనులతో కూడిన హోమకుండమున

శ్లో॥ పయసా సర్పిషా చైవ - తిలే నాగ్నౌ స్పృశన్ ఘటం
ప్రత్యేకం జుహుయా న్మంత్రం - అష్టోత్తర సహస్రకమ్॥

తా॥ పాలతోను, నేతితోను, నువ్వులతోను ఘటమును తాకుచు వేయియెనిమిదిమార్లు మంత్రమును జపించుచు అగ్నియందు హోమము చేయవలెను.

శ్లో॥ ప్రత్యేకం చ బలిం దద్యా - ద్రాజసం రాజసం త్విదం
తతో ముహూర్తం ధ్యాత్వా చ- సర్వకర్మ సదాశ్రయమ్॥

తా॥ ప్రత్యేకముగ బలినొసంగవలెను. పిదప సర్వకర్మలయందు ఆశ్రయుడైన దేవుని క్షణకాలము ధ్యానముచేసి

శ్లో॥ వాగ్యతో మంత్రసంపన్నః -సాంగుళీయ పవిత్రకం
అభిషించే న్మహాత్మానం - రాజానాం సర్వసిద్ధయే॥

తా॥ మంత్రసంపన్నుడగువాడు వాఙ్నియమము కలవాడై అంగుళీయముగా పవిత్రము ధరించి సర్వసిద్ధికొఱకు మహాత్ముడగు రాజును అభిషేకించవలెను.

శ్లో॥ అభిషేకేన సంపన్నః - పురందరసమో భవేత్
తేజసా దిత్య సంకాశః - సర్వశత్రు విమర్దనః॥

తా॥ అట్లు అభిషేకింపబడినవాడు దేవేంద్రునితో సమానుడగును. సూర్యసమానమైన తేజస్సు కలవాడగును. సర్వశత్రువులను నాశనము చేయగలవాడగును.

శ్లో॥ సప్తద్వీపవతీం భూమిం - పంచాశత్కోటి యోజనం
తేన వీర్యేణ భుంజీత - శతవర్షాణి జీవతి॥

తా॥ సప్తద్వీపములుకల్గి ఏబదికోట్ల యోజనముల విస్తీర్ణముకల భూమిని ఆ పరాక్రమముచే అనుభవించుచు నూరుసంవత్సరములు జీవించును.

శ్లో॥ ఏవమేవ తు కర్తవ్యం ప్రతిమాసం సమంత్రిణాం
షణ్మాసేషు తథా కుర్యా త్సార్వ భౌమత్వ మిచ్ఛతామ్॥

తా॥ మంత్రిసహితుడైన రాజునకు ప్రతిమాసమునందు ఇది కర్తవ్యము. సార్వభౌముని పదవి కోరువారు ఆరుమాసములిట్లు చేయవలెను.

శ్లో॥ మంత్రిణాం పూజయే ద్రాజా -యథాశక్తి సమంచితః
గో భూ హిరణ్య వస్త్రాద్యై - ర్వాహనాదిభి రేవచ॥

తా॥ రాజు యథాశక్తిగా గోవులతోను, బంగారము, వస్త్రాదులు, వాహనాదులతోను మంత్రవేత్తలను పూజింపవలెను.

శ్లో॥ తత్ప్రసాదా న్మహేశత్వం - తస్మా త్కామం ప్రపూజయేత్
మంత్రీ చ నిత్యయుక్తాత్మా రాజ్ఞాం -సర్వం సమాచరేత్॥

తా॥ ఆ మంత్రవేత్తలవలననే ఆతనికి మహేశత్వము సిద్ధించును కాన రాజు మంత్రవేత్తలను మిక్కిలి పూజింపవలెను. మంత్రివేత్తకూడ నిత్యము సద్బుద్ధితో రాజునకై సర్వము ఆచరించుచుండవలెను.

ఇతి శ్రీ పరాశరసంహితాయాం పరాశర మైత్రేయసంవాదే
రాజాభిషేకకథనంనామ చతుష్షష్టితమః పటలః

# శ్రీ పరాశర సంహితా

## పంచషష్టితమః పటలః

## గజాశ్వరక్షా ప్రయోగః

## అశ్వస్తంభన వశ్య ప్రయోగాది కథనం

శ్రీ పరాశరః

శ్లో॥ అథాన్య దపి వక్ష్యామి గజాదీనాం సురక్షితం
అశ్వానాం నిలయం చైవ గజానాం చైవ సన్నిధౌ॥

తా॥ శ్రీపరాశరుల వారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా; ఏను గులు మున్నగువాని రక్షణకు సంబంధించిన వేరొక విషయము చెప్పు చున్నాను, అశ్వముల నిలయముగూర్చి గజముల సన్నిధిని గూర్చి చెప్పుచున్నాను వినవలసినది.

శ్లో॥ పూర్వవ త్కుంభసంస్కారం అయుతం తు సమాచరేత్
హోమం కృత్వా తు తత్రైవ బలిం కృత్వా విచక్షణః॥

తా॥ పూర్వము రాజాభిషేక కథనమున చెప్పినట్లె కుంభ సంస్కారముచేసి పదివేల పర్యాయములు మంత్రమును జపింపవలెను. అచ్చటనే హోమమొనర్చి విచక్షణుడగు కర్త బలి నాచరింపవలెను.

శ్లో॥ తేనైవ ప్రోక్షయే న్మంత్ర గజా నశ్వాం శ్చ సంయుతం
ఏవమేవం తు కర్తవ్యం – మాసేమాసే న తక్షణమ్॥

తా॥ ఆ మంత్రముతోనే ఏనుగులకు, గుఱ్ఱములకు ప్రోక్షణ మొనర్చవలెను. ఇట్లు ప్రతిమాసమునందు ఆచరింపవలెను.

శ్లో॥ ఏవం కృత్వా గజాశ్వానాం – వాయువేగ మనోజవః
బలం శిష్ట్యాదికం చైవ మద హర్ష వివర్ధనమ్॥

తా॥ ఇట్లు ఆచరించి ఏనుగులకు, గుఱ్ఱములకు వాయువేగ మనోవేగములను శాసనము ననుసరించు పద్ధతిని, మదమును, ఆనంద మును పెంపొందించనగును.

శ్లో॥ ఆరోగ్యత్వం చ సర్వేషాం - జాత్యశ్వా ఇవ తీవ్రగాః
మంత్రిణాం పూజయేద్రాజా - పూర్వవ ద్దృష్టమానసః॥

తా॥ అన్నింటికిని తీవ్రవేగముతో పోజాలిన జాతిగుఱ్ఱములవలె ఆరోగ్యము చేకూరును. పూర్వమువలెనే సంతుష్ట మనస్కుడై రాజు మంత్రులను పూజింపవలెను.

యుద్ధే శత్రుజయ ప్రయోగః

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి - రాజ్ఞాం యుద్ధే జయావహం
యుద్ధకాలే తు సంప్రాప్తే సమాహూయ చ మంత్రిణమ్॥

తా॥ యుద్ధమునందు శత్రువులను జయించు ప్రయోగము. ఓ మైత్రేయా! వేరొక విశేషాంశమును చెప్పుచున్నాను. దీనివలన రాజులకు యుద్ధమున జయము చేకూరును. యుద్ధకాలము సమీపింప గానే రాజు మంత్రిని ఆదరమున పిలచి

శ్లో॥ ఆత్మనో జయ మన్విచ్ఛన్ - ప్రార్థయే త్క్షత్రియో జయం
శత్రునాశం చ సర్వేషాం - గజానాం వాజినాం తథా
కుర్వీత రక్షణం రాజా మంత్రిణాం హృష్టమానసామ్॥

తా॥ తన జయమును కాంక్షించు రాజు ప్రార్థింపవలెను. సమస్త శత్రువులయొక్క నాశనమును కోరవలెను. తన సమస్తములగు ఏనుగులయొక్క గుఱ్ఱములయొక్క మంత్రుల సంతోషపూర్ణమగు మనస్సులయొక్క రక్షణము రాజు కావింపవలెను.

శ్లో॥ మంత్రీ చ ధ్యాన యుక్తాత్మా - సేనా స్తంభన మంత్రవిత్
దేవ మభ్యర్చ్య విధివ ద్ధనూమంతం సమాహ్వయేత్॥

తా॥ మంత్రవేత్తయును ధ్యానపూర్ణమగు మనస్సుకలవాడై సేనా స్తంభన మంత్రము నెరిగినవాడై యథావిధిగా దేవుని పూజించి శ్రీ హనుమంతుని ఆహ్వానింపవలెను.

శ్లో॥ అజం హత్వాపి పిశితే - రాజసం బలి మాహరేత్
బలిప్రదాన కాలే తు - శత్రూణాం సర్వసైన్యకం
చతురంగాత్మకం మంత్రీ బలిత్వేన నివేదయేత్।

తా॥ మేకను చంపియు ఆ మాంసమున రాజసబలినొసంగవలెను. బలిప్రదాన సమయమున శత్రువుల సర్వసైన్యముతో కూడిన చతురంగ బలములన్నిటిని బలిగా మంత్రి నివేదించవలెను.

శ్లో॥ శత్రునామ్నా చ సంబధ్య - కారయే న్మంత్ర విత్తమః
శత్రుపక్షస్య రుధిరం - బలిత్వం చ దినేదినే॥

తా॥ శత్రునామముతో బంధించి మంత్రవేత్తయగువాడు ప్రతి దినమునందు శత్రుపక్షముయొక్క రక్తమును బలిగా నొనర్చవలెను.

శ్లో॥ భక్షయన్ సగణై స్సార్ధం - సారమేయ సమన్వితః
అనేనైవ తు కర్తవ్యం బలిం కుర్యా ద్విచక్షణః॥

తా॥ తనగణములతో కూడి ఇట్లు చివటివటకు శత్రువులను భక్షించును. విచక్షణుడగువాడు ఈ రీతిగా బలి కర్మను ఆచరింపవలెను.

శ్లో॥ అప్రకాశ్య మిదం మంత్రం - త్రిదశైరపి దుర్లభం
తతో దేవ స్స హృష్టాత్మా -గణై స్సార్ధ మహాబలిమ్॥

తా॥ దేవతలకుకూడా దుర్లభమైన ఈ మంత్రమును బయటకు చెప్పరాదు. ఇక దేవుడు సంతసించినవాడై తన గణములతో కూడి మహా బలిగా నొసంగిన శత్రువుల స్వీకరించును.

శ్లో॥ పిశితాం స్వకృతా న్నిత్యం - పరసైన్యం ప్రయచ్ఛతి
అచిరాదేవ తత్సైన్యం - నాశ మాయాతి సర్వదా॥

తా॥ తానిచ్చిన మాంసముతో బాటు ప్రతిరోజు పరసైన్యమున కూడ బలిగా పెట్టవలెను. చాలా తక్కువకాలములోనే ఆ శత్రుసైన్యము నాశనమగును.

శ్లో॥ తతో మంత్రి స్సుహృష్టాత్మా - యంత్రం లిఖ్య విధానతః
పరసైన్యపురో గత్వా - పరసైన్యం చ నాశయేత్॥

తా॥ పిమ్మట మంత్రవేత్త సంతుష్ట హృదయుడై యథావిధిగా యంత్రమును లిఖించి శత్రుసైన్యమునకు ఎదురుగా వెళ్ళిన శత్రు సైన్యము నాశనమగును.

శ్లో॥ సర్వదా యో హి మంత్రజ్ఞః - కుర్యా ద్విజయసిద్ధయే
పూర్వమేవ తు రాజాన - మభిషించే త్సమాహితః॥

తా॥ ఏ మంత్రజ్ఞుడు ఎల్లప్పుడు విజయసిద్ధికై యత్నమొనర్చునో అతడు ముందుగా రాజును అభిషేకించవలెను.

శ్లో॥ బలి హోమ సమాయుక్త మభిషేక ప్రయోగవిత్
బ్రాహ్మణాన్ తర్పయేత్ సర్వాన్ దేవాం శ్చైవ యథా బలిమ్॥

తా॥ బలి, హోమము మున్నగువానితో కూడిన అభిషేక ప్రయోగ మెరిగినవాడు దేవతలను బలితో తృప్తులజేసినట్లు బ్రహ్మవేత్తలను సమారాధనతో తృప్తుల గావింపవలెను.

శ్లో॥ రహస్య మేత ద్విజ్ఞానం -అ ప్రకాశ్యం చ మంత్రిణః

తా॥ ఈ మంత్ర విజ్ఞానము రహస్యమైనది. కావున మంత్రవేత్తలు వీనిని రహస్యముగ నుంచవలెను.

అగ్ని స్తంభన ప్రయోగః—

శ్లో॥ అగ్నిస్తంభన మన్విచ్ఛం - బలిం కుర్యా త్తు రాజసః
మాతృకాన్యాస సంయుక్తం మంత్రన్యాస మతఃపరమ్॥

తా॥ అగ్ని స్తంభనము కాంక్షించుచో రాజసబలి నొసంగవలెను. మాతృకాన్యాసమొనర్చి పిమ్మట మంత్రన్యాసము గావింపవలెను.

శ్లో॥ న్యస్త మంత్ర స్తు సుద్ధాత్మా హస్తానక్షత్ర బీజకం
చింతామణిం చ సంలక్ష్య - జపే న్మంత్రం సలక్షణమ్॥

తా॥ మంత్రన్యాసము గావించిన శుద్ధాత్ముడు హస్తానక్షత్రము బీజముగాగల చింతామణిని లక్ష్యముచేసికొని సలక్షణముగా మంత్రమును జపించవలెను.

శ్లో॥ ధారయే ద్వహ్నిరాజం చ - సస్వనం వాయుజం స్మరేత్
జల స్తంభన మేవం తు - కుర్యా న్మంత్రవిచక్షణాః॥

తా॥ అగ్నిధారణమొనర్చి అట్లు అగ్నిబీజధారణతో బిగ్గరగా వాయునందనుడగు హనుమంతుని స్మరింపవలెను. మంత్ర విచిక్షణులగు వారు ఇట్లే జల స్తంభన మాచరింపవలెను.

దారిద్ర్యహర ప్రయోగః—

శ్లో॥ రహశ్య మన్య ద్వక్ష్యామి - దారిద్ర్యభయనాశనం
ద్విభుజం వాయుజం ధ్యాత్వా — జంప కుర్యా ద్విచక్షణః॥

తా॥ దారిద్ర్య భయమును పోగొట్టజాలిన వేరొక రహస్యమును చెప్పుచున్నాను. మంత్రవేత్తయగువాడు రెండుచేతుల ఆకారముకల హనుమంతుని ధ్యానించి జపమొనర్చవలెను.

శ్లో॥ కపాలశక్తిపాణిం చ — వ్యాళకాది విభూషితం
సువర్ణవర్ణ మనిశం - దుకూల పరివేష్టితమ్॥

తా॥ కపాలము, శక్తి చేతులయందుకల వానిని, పాములను మున్నగువానిని ఆభరణములుగా ధరించినవానిని, బంగారపుచాయకల వానిని, ఎల్లప్పుడు పలుచని మెత్తని వస్త్రములు ధరించువానిని,

శ్లో॥ మధునా సంస్తవ ద్వాచం- ప్రసన్నవదనం ప్రభుం
కాంచీగుణం విశాలాక్షం - నాగయజ్ఞోతవీతినమ్॥

తా॥ స్తోత్రపాఠకులచే స్తుతింపబడువాడును, ప్రసన్నవదనుడును, సర్వసమర్థుడును, మంచి మొలనూలు ధరించియుండువాడును, విశాల నేత్రములు కలవాడును, సర్పము జందెముగా కలవాడును,

శ్లో॥ ఏవం విచింతయే దేవం - జప తర్పణ మాచరేత్
అపూపాన్ పృధుకాం శ్చైవ ప్రత్యేకం చ సహస్రకమ్॥

తా॥ అని ఈ రీతిగా శ్రీ హనుమంతుని ధ్యానించి జపము తర్పణము కావింపవలెను. అప్పములను, అటుకులను ప్రత్యేకముగా వేయివేయిగా

శ్లో॥ జుహుయా న్మంత్రసంసిద్ధిః - లక్షీం ప్రాప్నో త్యసంశయః
రాత్రౌ నిత్యం బలిం కుర్యా త్సాత్వికం బలి మంత్రవిత్॥

తా॥ హోమము చేయవలెను. ఇట్లు మంత్రసిద్ధియగును. నిస్సందేహముగ సంపద లభించును. మంత్రవేత్తయగువాడు ప్రతినిత్యము రాత్రియందు సాత్వికమగు బలి నొసంగవలెను.

వశ్య ప్రయోగః—

శ్లో॥ వశ్యమిచ్ఛన్ మహాదేవం -రక్తవర్ణేన భావయేత్
ఆత్మానం వాయుజం ధ్యాత్వా - సర్వత్ర చరతే మహీమ్॥

తా॥ వశ్యముకోరువారు మహాదేవుడగు హనుమంతుని రక్తవర్ణునిగా భావింపవలెను. ఆత్మరూపునిగా హనుమంతుని ధ్యానించి భూమియంతట సంచరించగా

శ్లో॥ బలిప్రదాన శిష్యస్య - సర్వవశ్యం భవేత త్సదా
మంత్రసిద్ధ స్సలోకే ఒస్మిన్ - సమాచారం ప్రచక్షతే॥

తా॥ బలినొసగు శిష్యునకు ఎల్లప్పుడు సర్వము వశ్యమగును. మంత్రసిద్ధుడగు నాతడు ఈ లోకమున యావత్సమాచారము తెలిసికొనగలడు.

శ్లో॥ సర్వజ్ఞ స్సర్వదా మంత్రీ రాజ్ఞా రక్షేన్ విచింతయేత్
కర్మణా మనసా వాచా మంత్రీ రాజ్ఞాం హితం స్మరేత్॥

తా॥ సర్వజ్ఞుడగు మంత్రవేత్త ఎల్లప్పుడు రాజుయొక్క రక్షను ఆలోచించవలెను. మనసా, వాచా, కర్మణా కూడ మంత్రాంగమెరిగిన మంత్రి రాజుల యొక్క మేలునే కోరవలెను.

శ్లో॥ అస్మిన్ సురక్షితే సర్వం - జగదేక శ్చరాచర

తా॥ రాజు రక్షింపబడగా చరాచర జగత్తంతయు రక్షింపబడినట్లే.

శ్లో॥ తతో బ్రాహ్మణ దేవానాం - గవాం చైవతు రక్షణం
కుర్యా న్మంత్రీ మహాప్రాజ్ఞో - యథాశక్తి వరం చ యత్॥

తా॥ పిదప బ్రాహ్మణులయొక్క, గోవులయొక్క రక్షణము గావింపవలెను. మహాజ్ఞానియగు మంత్రజ్ఞుడు ఏదిమంచిదో దానినే యథాశక్తిగా ఆచరింపవలెను.

శ్లో॥ అథ్యాఽన్యత శ్చ వీర్యస్య - మహ ద్భవతి పాతకం
సర్వభూతాని రక్షార్థం - తస్మా ద్రక్షాం ప్రచింతయేత్॥

తా॥ అట్లుకాక వేరుకరీతిగా అయినచో ఆతనికి మిక్కిలి పాతకము కల్గును. సర్వప్రాణులు రక్షింపదగియున్నవి. కావున ప్రాణిరక్షనే ఆలోచించవలెను.

శ్లో॥ సర్వభూతహితే యుక్తః - సత్యవాదీ దృఢవ్రతః
జపధ్యానరత శ్శాంతో - భస్మ స్నాన పరాయణః॥

తా॥ అన్ని ప్రాణుల మేలును కోరుచుండువాడు, సత్యమునే మాట్లాడువాడు, దృఢమగు వ్రతము కలవాడు జపము, ధ్యానముల యందు నిష్ఠ కలవాడు శాంతగుణము కలవాడు, విభూదిస్నానమాచరించువాడు,

శ్లో॥ వేద శాస్త్రార్థ తత్వజ్ఞో - మహాదేవ పరాయణః
ఏభి స్సర్వాత్మనా యుక్తో - దేవాలయ సమాశ్రయః॥

తా॥ వేదశాస్త్రార్థతత్వమెరిగినవాడు, మహాదేవునియందే ధ్యానముంచువాడు పైలక్షణములు పూర్తిగానిండియుండువాడు, దేవాలయమునాశ్రయించి యుండువాడు,

శ్లో॥ బలిప్రదాన శీలస్సన్ - జపే న్మంత్రం సమాహితం
జపేత స చిరంకాలం - ఆరోగి శ్రీనివాసకః
పుత్ర పౌత్రాదిభి ర్యుక్తో - మహావంశ ప్రవర్తకః॥

తా॥ బలి ప్రదానము చేయుచుండువాడై సమకూడిన యోగ్య మంత్రమును జపించవలెను. అట్లు జపించినవాడు చిరకాలము రోగ రహితుడుగాను, ధన సహితుడుగాను ఉండి పుత్ర పౌత్రాదులతో కూడి యుండువాడై మహావంశ ప్రవర్తకుడై సకల శుభములబడయును,

ఇతి శ్రీ పరాశరసంహితాయాం
పరాశర మైత్రేయ సంవాదే
పంచముఖ హనుమన్మంత్ర వివరణే
గజాస్య సంరక్ష ణాగ్ని స్తంభన వశ్యప్రయోగాది కథనం
నామ పంచషష్టితమఃపటలః

# శ్రీ పరాశర సంహితా

## షట్ షష్టితమః పటలః

## యంత్రస్వరూప ఆపదుద్ధారకస్తోత్ర కథనం

శ్రీ పరాశరః

శ్లో॥ యంత్రస్వరూప వక్ష్యామి - శృణుష్వ మునిపుంగవ
దశకోణాత్మకం చక్రం - సర్వసిద్ధి ప్రదాయకమ్॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మునిశ్రేష్ఠా, మైత్రేయా! యంత్రస్వరూపమును గూర్చి చెప్పుచున్నాను. వినవలసినది. పదికోణములుకల ఈ యంత్రము సర్వసిద్ధులను ప్రసాదించునది.

శ్లో॥ త్రికోణం చ చతుష్కోణం - పంచకోణం తథైవ చ
షట్కోణం చ తథా యంత్ర మితి మంత్రవిదో విదుః॥

తా॥ మూడుకోణములు కలది, నాలుకోణములది, ఐదుకోణములు కల్గినది. ఆరుకోణములతో నుండునది ఇట్లు యంత్రములగూర్చి మంత్ర వేత్తలు తెలియుదురు.

శ్లో॥ భూపురత్రయ సంయుక్తం - శూలాద్యం చ మనోహరం
ప్రాసాద బాలానృసింహ - పంచాయతన షడంగకమ్॥

తా॥ మూడు భూపురములతో కూడినది, మనోహరమైన శూలము ఆద్యముననున్నది, ప్రాసాదమున పంచాయతన షడంగములు కలదియు.

శ్లో॥ చక్రాంతరం ప్రవక్ష్యామి - సర్వలోకోపకారకం
శ్రీమ దష్టాక్షరీచక్రం వక్ష్యామి మునిపుంగవ।

తా॥ ఓ మునిశ్రేష్ఠా సర్వలోకోపకారకమైన వేరొకచక్రమును చెప్పుచున్నాను. అది శ్రీమదష్టాక్షరీచక్రము.

శ్లో॥ ఆదౌ చంద్రం సమాలిఖ్య - హ్యష్టకోణం చ విన్యసేత్
తద్బాహ్యే వృత్త మాలిఖ్య - ద్వాదశార మతః పరమ్॥

తా॥ మొదట చంద్రము లిఖించి అష్టకోణముల నేర్పరుపవలెను. దాని బయట వృత్తమును గీచి దానికి బాహ్యమున పండ్రెండు దళముల నిర్మింపవలెను.

శ్లో॥ తద్బాహ్యే వృత్త మాలిఖ్య - తద్బాహ్యే భూపురద్వయం
చతుర్ద్వార సమాయుక్తం - లేఖయే చ్ఛ ప్రయత్నతః॥

తా॥ దానికి బాహ్యమున వృత్తములిఖించి దానికి బాహ్యమున నాల్గు ద్వారములతో కూడిన భూపురద్వయమును ప్రయత్న పూర్వకముగా లిఖించవలెను.

శ్లో॥ నృసిం హైకాక్షరీం మధ్యే - లేఖయే చ్ఛ ప్రయత్నతః
శ్రీమ దష్టాక్షరీవిద్యా - మష్టకోణేషు విన్యసేత్॥

తా॥ మధ్యభాగమున నృసింహైకాక్షరిని లిఖించి ఎనిమిదికోణము లందు ఎనిమిది అక్షరములుగా శ్రీహనుమ దష్టాక్షరీ మంత్రమును లిఖింపవలెను,

శ్లో॥ పూర్వాది దళ మారభ్య - దళై ర్ద్వాదశభి స్తథా
వాసుదేవ ద్వాదశార్ణం - విలిఖే చ్ఛ ప్రదక్షిణమ్॥

తా॥ తూర్పు భాగముననున్న దళము మొదలుకొని పండ్రెండు దళములలో ప్రదక్షిణ విధానముతో వాసుదేవద్వాదశాక్షరి లిఖింపవలెను.

శ్లో॥ పంచాశ ద్బీజవర్ణాని - భూపురేషు లిఖేత్ క్రమాత్
ప్రాణప్రతిష్ఠాం కుర్వీత - ప్రత్యహం పూజయే జ్జనః॥

తా॥ ఏబది బీజాక్షరములను క్రమముగా భూపురములందు లిఖింపవలెను. ఆ యంత్రమునకు ప్రాణప్రతిష్ఠచేసి ప్రతిరోజు దానిని పూజింపవలెను.

శ్లో॥ తామ్రేణ వా సువర్ణేన - భూర్జేన రజతేన వా
చక్రం కృత్వా తు మతిమాన్ - పూజయే చ్చ ప్రయత్నతః॥

తా॥ రాగితోకాని బంగారముతోకాని, భూర్జపత్రమునకాని వెండితో కాని బుద్ధిమంతుడగువాడు యంత్రము తయారుచేసి పూజింపవలెను.

శ్లో॥ గురుం సంపూజ్య యత్నేన -గృహ్ణీయా చ్చక్ర ముత్తమం
అష్టోత్తర సహస్రం వా - అష్టోత్తర శతం తు వా
శ్రీమ దష్టాక్షరీ చక్ర - గ్రహణే సంస్పృశన్ జపేత్॥

తా॥ ప్రయత్నపూర్వకముగా గురువును పూజించి ఉత్తమమగు యంత్రమును స్వీకరింపవలెను. ఆ యంత్రమును గ్రహించునప్పుడు అష్టోత్తర సహస్రము కాని, అష్టోత్తర శతము కాని అష్టాక్షరీ చక్రమును స్పృశించుచు జపించవలెను.

శ్లో॥ చక్రస్య వీర్యలాభాయ — నద్యాం వా సింధుసంగమే
ఖర్జూర కదళీ ద్రాక్షా — పనసామ్ర ఫలాని వై
సమర్ప్య తస్మై చక్రేతు - కుబేర సదృశో భవేత్॥

తా॥ చక్రమునకు శక్తిసమకూడుటకై నదియందు కాని నది సముద్రమున కలియు సంగమ ప్రదేశమునకాని జపించవలెను.

ఖర్జూరముకాని, అరటి, ద్రాక్ష, పనస, మామిడిపండ్లనుకాని ఆ యంత్రి మునకు నివేదన మొనర్చిన అతడు కుబేరునితో సమానుడుగా ధనవంతుడు కాగలడు.

శ్లో॥ యస్య త న్మందిరే చక్రం – పూజితం తు త్రికాలతః
తస్య గేహే మహాలక్ష్మీ – స్థిరా భవతి సర్వదా॥

తా॥ ఎవనిఇంట అష్టాక్షరీ యంత్రము మూడువేళల పూజింపబడునో వానియింట ఎల్లప్పుడు లక్ష్మి కదలక వసించును.

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి – శృణుష్వ మునిపుంగవ ।
ప్రణవే వేదమంత్రేషు – సర్వే ష్వపి చ సర్వశః
నాధికారో జఘన్యానాం – తేషాం నోపదిశే ద్బుధః॥

తా॥ ఓ మునిశ్రేష్ఠా ! ఇంకొక విశేషము చెప్పుచున్నాను వినవలసినది. ప్రణవ విషయమున, వేదమంత్రముల విషయము లన్నింటి యందు అధములగు వారికి అధికారములేదు. కావున విజ్ఞుడు అట్టివారికి ఉపదేశ మొనర్చరాదు.

శ్లో॥ నామ స్మరణమాత్రే చ – స్తోత్రాణాం పఠనే తథా
తేషామ ప్యధికారో ఒస్తి – హీతి శాతాతపో ఒబ్రవీత్॥

తా॥ భగవన్నామ స్మరణమున, స్తోత్రములను పఠించుటయున్నగు వానియందు వారికి కూడ అధికారము కలదని శాతాతపుడు పల్కెను.

శ్లో॥ సర్వేషా మేవ మంత్రాణాం – నియమః ఫలద స్స్మృతః
స్తోత్రాణాం స్మరణా దేవ – స్వచ్ఛందం మను రబ్రవీత్॥

తా॥ అన్ని మంత్రములకు చెప్పబడిన నియమములే వాటి ఫలముల నొసంగును. స్తోత్రములకు స్మరణము వలననే ఫలితము సిద్ధి నని స్వయముగా మనువే చెప్పెను.

శ్లో॥ సప్తాక్షర్యాం హనూమత స్తథా నామస్మృతా వపి
శైవ పంచాక్షరీ మంత్రే భాషామంత్రేషు సర్వశః
అధికారో జఘన్యానా - మిత్యేవం మను ర్బ్రవీత్॥

తా॥ సప్తాక్షరీ హనుమన్మంత్రముననను, భగవన్నామ స్మరణము నను, శివపంచాక్షరీ మంత్రమున, ఆయా భాషామంత్రములైన అల్ప మంత్రములందును అన్నిట జఘన్యులకును అధికారము కలదని మనువు చెప్పెను.

శ్లో॥ గాయత్ర్యాం ప్రణవే చైవ - వేదాభ్యాసే తథైవ చ
స్త్రీణాం తథా జఘన్యానాం - నాధికారః కథం చ న॥

తా॥ గ్రాయత్రి విషయమున, ప్రణవ విషయమున, వేదాభ్యాసము నందును, స్త్రీజఘన్యులకు ఎట్లును అధికారములేదు.

శ్లో॥ బ్రాహ్మీముహూర్తే సకలా శ్చ మంత్రాః
శైవాః ప్రదోషే గణేశాః ప్రభాతే
మధ్యందినే భాస్కర వైష్ణ వాశ్చ
శక్తా నిశీధే సకలాగమోక్తిః॥

తా॥ బ్రాహ్మీముహూర్తమున అన్ని మంత్రములను అనుష్ఠింప వచ్చును. శైవమంత్రములను ప్రదోషసమయములందు, గాణపత్యములను ఉదయముననను, సూర్యసంబంధమైనవి, వైష్ణవమంత్రములను మధ్యాహ్న సమయమున, శాక్తేయములను అర్థరాత్రమున జపింపవలెనని అన్ని శాస్త్రములు చెప్పుచున్నవి.

శ్లో॥ అ స్త్యన్య త్పరమం గుహ్యం - సర్వశాస్త్రార్థ సమ్మితం
ఆపదుద్ధారకం స్తోత్రం - వక్ష్యామి మునిపుంగవ।

తా॥ సరశాస్త్ర సమ్మతమైన ఇంకొక రహస్యవిషయము కలదు. ఓ మునిశ్రేష్ఠా। ఆ ఆపదుద్ధారక స్తోత్రమును చెప్పుచున్నాను.

వ॥ అస్య శ్రీ ఆపదుద్ధారకస్తోత్ర మంత్రస్య
విభీషణ ఋషిః। అనుష్టు ప్ఛందః। శ్రీ హనుమాన్

దేవతా; మారుతాత్మజ ఇతి బీజం।
అంజనాసూను రితి శక్తిః। వాయుపుత్ర ఇతి
కీలకం। శ్రీహనుమ త్ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః।
మూల మంత్రేణ న్యాసం కుర్యాత్।

తా॥ పైరీతిగా ఋషిచ్ఛందాదులనుచెప్పి మూలమంత్రముతో న్యాసము గావించవలెను.

ఆపదుద్ధారక స్తోత్రము—

శ్లో॥ ఓం నమో భగవతే తుభ్యం - నమో మారుతసూనవే
నమ శ్శ్రీరామభక్తాయ - శ్యామాస్యాయ చ తే నమః॥

తా॥ ఓ భగవంతుడవైన వాయునందనా నీకు నమస్కారము. శ్రీరామ భక్తుడగు శ్యామవర్ణముకల ముఖముగలనీకు నమస్కారము.

శ్లో॥ నమో వానరవీరాయ — సుగ్రీవ సఖ్యకారిణే
లంకా విదాహకా యాథ - హేలా సాగర తారిణే॥

తా॥ వానరవీరునకు నమస్కారము. సుగ్రీవునితో రామునకుసఖ్యమేర్పడుటకు కారకుడైనవానికి నమస్కారము. లంకను దహించినవానికి నమస్కారము. సునాయాసముగా సముద్రమును దాటినవానికి నమస్కారము.

శ్లో॥ సీతాశోక వినాశాయ - రామముద్రా ధరాయ చ
రావణస్య కులచ్ఛేద - కారిణే తే నమోనమః॥

తా॥ సీతాదేవి శోకమును పోగొట్టినవానికి నమస్కారము. రామ ముద్రికను ధరించినవానికి నమస్కారము. రావణ కులమునకు నాశకుడవైన నీకు నమస్కారము.

శ్లో॥ మేఘనాథ మఖధ్వంస కారిణే। భయహారిణే।
వాయుపుత్రాయ వీరాయ - ఆకాశోదర గామినే॥

తా॥ మేఘనాధుని యజ్ఞమునకు నాశనకారియైన వానికి నమస్కారము. వాయునందనునకు నమస్కారము. వీరునకు నమస్కారము. ఆకాశమధ్యభాగమున పోవువానికి నమస్కారము.

శ్లో॥ వనపాల శిరచ్ఛేత్రే లంకాప్రాసాద భంజినే
జ్వల త్కనకవర్ణాయ దీర్ఘ లాంగూల ధారిణే॥

తా॥ లంకా వనపాలకుల శిరస్సులను ఛేధించినవానికి నమస్కారము. లంకా పట్టణ ప్రాసాదమును బ్రద్దలుకొట్టిన వానికి నమస్కారము. తప్తకాంచన వర్ణము కలవానికి నమస్కారము. పొడవైనతోక ధరించిన వానికి నమస్కారము.

శ్లో॥ సౌమిత్రే జీవదాత్రే చ - రామదూతాయ తే నమః
అక్షస్య వధకర్త్రే చ - బ్రహ్మశక్తి నివారిణే॥

తా॥ లక్ష్మణునకు ప్రాణదానమొనర్చిన వానికి నమస్కారము. రామదూతకు నమస్కారము. అక్షుని సంహరించినవానికి నమస్కారము. బ్రహ్మశక్తి నివారకునకు నమస్కారము.

శ్లో॥ లక్ష్మణాంగ మహాశక్తి ఘాత క్షత వినాశినే
రక్షోఘ్నాయ రిపుఘ్నాయ - భూతఘ్నాయ చ తే నమః॥

తా॥ లక్ష్మణునిశక్తికి ఎదురుశక్తి లేకుండ చేసిన వానికి నమస్కారము. రాక్షసుల సంహరించువానికి, శత్రుసంహారకునకు, భూత విధ్వంసనునకు నమస్కారము.

శ్లో॥ ఋక్ష వానర వీరౌక - ప్రాణదాయక తే నమః
మహాభయ రిపు ఘ్నాయ -భక్త త్రాణైక కారిణే॥

తా॥ ఎలుగుబంట్లు, వానరముల వీరులకు ప్రాణముల నొసంగిన నీకు నమస్కారము. మహాభయములను శత్రువులను నాశనమొనర్చు నీకు నమస్కారము. భక్తుల రక్షించువానికి నమస్కారము.

శ్లో॥ పర ప్రేరిత మంత్రాణాం - యంత్రాణాం స్తంభకారిణే
పయః పాషాణ తరణ - కారణాయ నమో నమః॥

తా॥ ఇతరులచే ప్రయోగింపబడిన మంత్రములను, యంత్రములను స్తంభింపజేయువానికి నమస్కారము. వయస్సునెడు పాషాణమును దాటించుటలో కారణమైనవానికి నమస్కారము.

శ్లో॥ బాలార్క మండల గ్రాస - కారిణే తారిణే నమః
నఖాయుధాయ భీమాయ - దండాయుధ ధరాయ చ॥

తా॥ ఉదయసమయ సూర్యమండలమును పట్టినవానికి నమస్కారము. తరింపజేయువానికి నమస్కారము. గోళ్ళే ఆయుధములుగా కలవానికి నమస్కారము. భయంకరునకు నమస్కారము. దండాయుధమును ధరించినవానికి నమస్కారము.

శ్లో॥ రిపుమాన వినాశాయ - రామాజ్ఞా లోకరక్షణే
ప్రతిజ్ఞాన స్థితా యాథ రక్షో భూత వధార్థినే॥

తా॥ శత్రు గౌరవమును నాశనమొనర్చువానికి నమస్కారము. రామాజ్ఞచే లోకమును రక్షించువానికి నమస్కారము. ఆడిన మాటయందుండువాడు, రాక్షసులను, భూతములను నాశనము చేయగోరువాడు,

శ్లో ॥కరాళ శైల శస్త్రాయ - ద్రుమ శస్త్రాయ తే నమః
బాలైక బ్రహ్మచర్యాయ - రుద్రమూర్తిధరాయ చ॥

తా॥ కఠినమైన శిలలే శస్త్రములుగా గలవానికి నమస్కారము. వృక్షమే శస్త్రముగా కలవానికి నమస్కారము. బాలబ్రహ్మచారికి నమస్కారము. రుద్రమూర్తిధరునకు నమస్కారము.

శ్లో॥ విహంగమాయ శర్వాయ - వజ్రదేహాయ తే నమః
కౌపీనవాససే తుభ్యం - రామభక్తిరతాయ చ॥

తా॥ ఎగిరెడివానికి నమస్కారము. శివస్వరూపునకు నమస్కారము. వజ్రాదేహునకు నమస్కారము. కౌపీనమును ధరించువానికి నమస్కారము. రామభక్తిరతుడవగు నీకు నమస్కారము.

శ్లో॥ దక్షిణాశా భాస్కరాయ - శత చంద్రోదయాత్మనే
కృత్యా శతవిధఘ్నాయ - సర్వక్లేశ హరాయ చ॥

తా॥ దక్షిణమున సముద్రలంఘన సమయమున సూర్యునివలె తేజస్సుతో విరాజిల్లినవానికి నమస్కారము. నూరు చంద్రోదయములతో సమానమైన ప్రకాశముకలవానికి నమస్కారము. మారక దేవతల విధాన శతమును నాశనము గావించువానికి నమస్కారము. సర్వక్లేశములను హరింపజాలినవానికి నమస్కారము.

శ్లో॥ అశోకవన విధ్వంసకారిణే పాపహారిణే
సంయుగే చ మహాశక్తి ధ్వాంతక్షణ వినాశినే॥

తా॥ అశోకవనమును విధ్వంస మొనర్చినవానికి నమస్కారము. పాపముల హరించువానికి నమస్కారము. యుద్ధమున శత్రువుల మహా పరాక్రమమను చీకటిని క్షణములో నాశన మొనర్చువానికి నమస్కారము.

శ్లో॥ పరసైన్య బలఘ్నాయ - శస్త్రఘ్నాయ చ తే నమః
విషఘ్నాయ ద్విషఘ్నాయ — జ్వరఘ్నాయ చ తే నమః॥

తా॥ శత్రుసైన్య బలమును నాశన మొనర్చువానికి, పరశస్త్రముల ధ్వంసము చేయువానికి, విషనాశకునకు, శత్రునాశకునకు, జ్వరములు పోగొట్టువానికి నీకు నమస్కారము.

శ్లో॥ స్వామ్యాజ్ఞా పార్థసంగ్రామ - సంఘే విజయకారిణే
భక్తానాం దివ్యవాదేషు - సంగ్రామే జయదాయినే॥

తా॥ స్వామి ఆజ్ఞలయందు అర్జునుని యుద్ధములందు విజయము చేకుర్చువానికి నమస్కారము. భక్తులయొక్క దివ్యమగు వాదములందు, యుద్ధములందు జయమునొసంగువానికి నమస్కారము.

శ్లో॥ కిలకిల్యా బూబు రోచ్చ ఘోర శబ్దకరాయ చ
సర్వోగ్రవ్యాధి సంస్తంభ కారిణే వనచారిణే॥

తా॥ భూతప్రేతాదులను భయపెట్టజాలిన కిలకిల, బూబూ మున్నగు భయంకర శబ్దములు చేయువానికి నమస్కారము. సమస్తములగు గొప్ప వ్యాధులను నిలిపివేయగలవానికి, వనమునందు సంచరించువానికి నమస్కారము.

శ్లో॥ సదా పక్వఫలహార - సంతుష్టాయ విశేషతః
మహార్ణవ శిలాబద్ధ సేతవే తే నమో నమః॥

తా॥ ఎల్లప్పుడు పక్వఫలములనిడుటవలన మిక్కిలి సంతసించు వానికి నమస్కారము. మహాసముద్రమునందలి శిలలతో సేతువు నిర్మించినవానికి నమస్కారము.

శ్లో॥ వాదే వివాదే సంగ్రామే - భయే ఘోరే మహావనే
తస్కర వ్యాఘ్ర సింహేషు - పఠేత్ స్తోత్రం భయం న హి॥

తా॥ వాదమునందు, తగవునందు, యుద్ధమునందు, భయము కల్గినప్పుడు, ఘోరారణ్యమునందు, దొంగలవలన, పెద్దపులివలన, సింహమువలన ప్రమాద మేర్పడినప్పుడు ఈ స్తోత్రమును పఠించిన వాని వలన భయము కలుగదు.

శ్లో॥ దివ్యే భూతభయే వ్యాధౌ - విషే స్థావర జంగమే
రాజ శస్త్రభయే ఘోరే - తథా గ్రహభయేషు చ॥

తా॥ దైవసంబంధమైన, భూతసంబంధమైన భయములందును, వ్యాధులందును, విషద్రవ్యాది స్థావర విషములందును, సర్పవృశ్చికాది జంగమ విషములందును, రాజభయమునను, ఘోరమగు శస్త్రముల భయమునను, గ్రహబాధయందును ఈ స్తోత్రమునుపఠించవలెను.

శ్లో॥ జలే సర్పే మహావృష్టౌ దుర్భిక్షే ప్రాణసంప్లవే
పఠన్ స్తోత్రం ప్రముచ్యేత - భయేభ్య స్సర్వతో నరః॥

తా॥ నీటిప్రమాదమునను, సర్పభయమునను, పెద్దవర్షమునందును, దుర్భిక్షమేర్పడినను, ప్రాణాపాయము సంభవించినను మనుజుడు ఈ స్తోత్రము పఠించిన సర్వభయములు తొలగును.

శ్లో॥ తస్య క్వాపి భయం నాస్తి - హనూమ త్స్తవ పాఠతః
త్రికాలం సర్వదా భక్త్యా - పఠే న్నిత్య మిమం స్తవమ్॥

తా॥ ఈ హనుమత్ స్తోత్రమును పఠించువానికి ఎచ్చటను భయములేదు। ఈ స్తవమును ప్రతిదినము మూడువేళల భక్తితో పఠింపవలెను.

శ్లో॥ సర్వా న్కామా నవాప్నోతి - నాత్ర కార్యా విచారణా

తా॥ పైన చెప్పిన రీతిగా ఈ స్తోత్రము పఠించువాడు అన్ని కోరికలు పొందగల్గును. ఇందు సందియములేదు.

శ్లో॥ వినతాయా స్వమాతు శ్చ -దాసీత్వస్య నివృత్తయే
సుధార్థం యాతుకామాయ - మహాపౌరుషశాలినే
విభీషణ కృతం స్తోత్రం - తార్ క్ష్యాయ సముదీరితం
యే పఠన్తి సదా భక్త్యా సిద్ధయ స్తత్కరే స్థితాః॥

తా॥ తన తల్లియగు వినతయొక్క దాస్యము తొలగించుటకు అమృతకలశమును తేగోరిన మహాపౌరుషశాలియగు గరుత్మంతునకు విభీషణ కృతమైన ఈ స్తోత్రము చెప్పబడినది. ఎల్లప్పుడు భక్తితో ఈ స్తోత్రము నెవ్వరు పఠింతురో వారికి సర్వ సిద్ధులు కరతలామలకములు.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయ సంవాదే
యంత్ర స్వరూప ఆపదుద్ధారక స్తోత్ర కథనం నామ
షట్షష్టితమః పటలః

# శ్రీ పరాశర సంహితా

## సప్తషష్టితమః పటలః

## నిత్యకర్మవిధికథనం

శ్రీ పరాశరః-

శ్లో॥ మునే! శృణుష్వ వక్ష్యామి నిత్యకర్మవిధిక్రమః
యస్య స్మరణ మాత్రేణ - మంత్రా స్సిధ్యంతి సర్వశః॥

తా॥ శ్రీ పరాశరుల వారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయ మహా మునీ! నిత్యకర్మ విధి క్రమమును చెప్పుచున్నాను వినుము. దీనిని స్మరించుట వలననే అంతటను మంత్రసిద్ధి యగును.

శ్లో॥ సమాధానం గురుధ్యానం - శాస్త్రోక్త విధిపూర్వకం
ప్రథమం దేవతాధ్యానం - స్తోత్రాణాం పఠనం తతః॥

తా॥ శాస్త్రోక్త విధితో చక్కగా గురుధ్యాన మొనర్చ వలెను, మొదట దేవతా ధ్యాన మొనర్చి పిదప స్తోత్ర పఠనము గావింపవలెను.

శ్లో॥ శౌచకర్మ తృతీయం స్యాత్ - చతుర్థం దంతధావనం
జలావగాహన స్నానం - మంత్రస్నానం తతఃపరమ్॥

తా॥ మూడవ కర్మ శౌచకర్మ. నాల్గవది పండ్లు తోముట పిదప నీటియందు మునిగి స్నానమాచరించుట. ఆ పిదప మంత్రస్నానము కర్తవ్యము.

శ్లో॥ నిత్య సంధ్యావిధి శ్చైవ - మంత్ర సంధ్యా తతఃపరం
భూశుద్ధి ర్భూతశుద్ధి శ్చ-మాతృకాన్యాస ఏవ చ॥

తా॥ అనంతరము నిత్యసంధ్యా విధి నాచరించ వలెను. ఆపైన మంత్రానుష్ఠానము గావింపనగును. భూశుద్ధి, భూతశుద్ధి, మాతృకాన్యాసము మున్నగునవి

శ్లో॥ కర్తవ్యాశ్చ జపస్యాదౌ – జపే దంగమనుం తతః
తతః ప్రధాన మంత్రం చ – జపే ద్యత్నా దతంద్రితః॥

తా॥ జపమునకు మొదట చేయదగినవి, అవి కాగానే అంగమంత్రములను జపింపవలెను. ఆ పిదప అవిచలిత మనస్కుడై ప్రధాన మంత్ర జపము కావింపనగును.

శ్లో॥ తతో జపసమాప్త్యన్తే – హోమపూజా విధిర్ద్వయః
హోమాన్తే పూజనం శ్రేష్ఠం – పూజాన్తే హోమ ఏవ వా॥

తా॥ జపము పూర్తి అయిన పిదప హోమ విధి, పూజా విధియు విధింప బడినవి. అందు హోమానంతరము పూజా విధి శ్రేష్ఠము. పూజానంతరము హోమ విధినైన గావింపవచ్చును.

శ్లో॥ తద్వై వ్యపరీత్యే నో దోష – ఇత్యుక్తం మంత్రవేదిభిః
జపాత్ శ్రేష్ఠతరం విద్ధి – తర్పణం మునిసత్తమ॥

తా॥ ఆ హోమ పూజా విధానములందు దేని పిదప దేనిని చేసినను దోషము లేదని మంత్రవేత్తలచే చెప్పబడినది. ఓ మైత్రేయ మహామునీ! జపము కంటె తర్పణము శ్రేష్ఠతరమని తెలిసికొనుము.

శ్లో॥ తర్పణా దుత్తమం విద్ధి-హోమం చైవ విశేషతః
హోమా చ్ఛ్రేష్ఠతరం లోకే – విద్ధి బ్రాహ్మణ భోజనమ్॥

తా॥ తర్పణము కంటెను హోమము విశేషించి ఉత్తమ మైనదిగా తెలిసికొనుము. అట్టి హోమము కంటెను శ్రోత్రియులకు చేయు సమారాధనము లోకమున శ్రేష్ఠమైనదిగా తెలిసికొనుము.

శ్లో॥ మంత్రోపదేశగురవ స్సర్వోత్కృష్టా జగత్త్రయే
స్వర్ణాలంకార వస్త్రై శ్చ – దక్షిణా గంధ పుష్పకైః॥

తా॥ మంత్రము నుపదేశించిన గురువులు ముల్లోకము లందును సర్వోన్నతులు. వారు బంగరు ఆభరణములతోను, వస్త్రములతోను, దక్షిణతోను, గంధ పుష్పాదులతోను

శ్లో॥ పూజనీయాః ప్రయత్నేన – తదానంత్యాయ కల్పతే
సర్వేషా మేవ మంత్రాణాం – అయమేవ వినిర్ణయః॥

తా॥ ప్రయత్న పూర్వకముగా పూజింపదగినవారు. అట్టి గురుపూజ అనంత ఫలితము నిచ్చును. అన్ని మంత్రములకు ఇదియే నిర్ణయము.

శ్లో॥ మంత్రాణాం వీర్యసిద్ధ్యర్థం - పంచశుద్ధి రుదీరితా
పంచశుద్ధిం వినా మంత్రో - న సిద్ధ్యతి జగత్త్రయే॥

తా॥ మంత్రముల వీర్యసిద్ధికై పంచశుద్ధి విధానము చెప్పబడినది పంచశుద్ధి లేకుండ ముల్లోకములందు మంత్రములు సిద్ధింపవు.

శ్లో॥ జప తర్పణ హోమా శ్చ ద్విజసంతర్పణం తథా
గురూణాం దక్షిణా చేతి - పంచశుద్ధి రుదాహృతా॥

తా॥ జపము, తర్పణము, హోమము, శ్రోత్రియులకు అన్న సమారాధనము. గురువునకు దక్షిణ సమర్పించుట అనునది పంచశుద్ధిగా చెప్పబడినది,

శ్లో॥ స్త్రీవిద్యానాం చ సర్వేషా - మంతే ష్వంగమనూన్ జపేత్
పుం విద్యానాం చ సర్వేషాం - ఆది ష్వంగమనూన్ జపేత్॥

తా॥ స్త్రీ మంత్రముల కన్నిటికి అనంతరమందు అంగ మంత్ర జపము లొనర్చవలెను. పురుష మంత్రములకైనచో అన్నిటికి ముందే అంగమంత్రములను జపించవలెను.

శ్లో॥ ఆత్మజప్యేషు మంత్రేషు-స్వాభిమానాస్పదో మనుః
ప్రధాన ఇతి విఖ్యాతః - త దన్యే త్వంగసంజ్ఞితాః॥

తా॥ తాను జపించు మంత్రములందు తనకిష్టమైన మంత్రమేది కలదో అది ప్రధాన మంత్రమనబడును. ఇతర మంత్రములన్నియు అంగ మంత్రములనబడును.

శ్లో॥ తదీయానాం చ చక్రాణా - మపి మంత్రక్రమేణ వై
అంగ ప్రధాన భావేన - పూజావిధి రుదాహృతా॥

తా॥ ఆయా మంత్రములకు సంబంధించిన యంత్రముల విషయమున కూడ మంత్ర క్రమము ననుసరించియే స్వీకరించనగును. ఇట్టి అంగ ప్రధానభావము ననుసరించియే పూజా విధియు చెప్పబడినది.

శ్లో॥ మంత్రం యంత్రం తథా తంత్రం - దేవతానుగ్రహార్థినా
త్రీణ్య ప్యవశ్యం సేవ్యాని - యంత్రం తేషు ప్రశిష్యతే॥

తా॥ మంత్రము యంత్రము తంత్రము అను మూడును దేవతానుగ్రహము కాంక్షించు వారికి తప్పక సేవింపదగినవి. వానియందు యంత్రము ప్రత్యేకమైనది.

శ్లో॥ యంత్రం మంత్ర మయం ప్రోక్తం-మంత్రాత్మా దేవ తేరితా
పురా భగవతా ప్యుక్తం - తంత్రే సమ్మోహనాహ్వయే॥

తా॥ మంత్రమయమైనదిగా యంత్రము చెప్పబడినది. మంత్రమునకు ఆత్మగా దేవత చెప్పబడినది. ఈ విషయము పూర్వము సమ్మోహన తంత్రము నందు భగవంతునిచేత కూడ చెప్పబడినది.

శ్లో॥ దేహాత్మనో ర్యథా భేదో - మంత్ర దైవతయో స్తథా
తస్మా త్సతే న్మహా మంత్రం - లిఖిత్వా తత్రపూజయేత్॥

తా॥ దేహమునకు, ఆత్మకు ఎట్టి భేదము కలదో అట్లు మంత్ర దైవతములకును భేదము కలదు. కాన మహామంత్రమును జపించవలెను. దానిని లిఖించి యంత్రముగా పూజింపవలెను.

శ్లో॥ వినా చక్రే చరే త్పూజా — దేవతా న ప్రసీదతి
తస్మా ద్యత్నేన కర్తవ్యం - మంత్రాణాం చక్రపూజనమ్॥

తా॥ యంత్రము వేయకుండ పూజనాచరించినచో దేవతానుగ్రహము కలుగదు. కావున మంత్రముల విషయమున యంత్ర పూజనము ప్రయత్న పూర్వకముగా ఆచరింపదగినది.

శ్లో॥ మంత్ర స్యైకస్య వా మనో రనేకస్యాపి వా మనోః

తా॥ అది ఒక మంత్రమునకైనను, అనేక మంత్రములుకలమనువునకైనను యంత్ర పూజనము కర్తవ్యము.

శ్లో॥ జపానుష్ఠాన కాలే తు ప్రత్యహం మంత్రవి త్తమః
భూశుద్ధిం భూతశుద్ధిం చ - బాహ్యాభ్యంతర మాతృకామ్॥
సకృదేవ ప్రకుర్వీత - న్యాసం చాపి యథావిధి॥

తా॥ ప్రతి దినమున జపానుష్ఠాన కాలమున మంత్రవేత్త భూశుద్ధిని, భూతశుద్ధిని, బాహ్యాభ్యంతర మాతృకాన్యాసమును మొదట ఒక్కమారే యథావిధిగా చేయవలెను.

శ్లో॥ ప్రతిమా చక్ర లింగాది - సాలగ్రామాది పూజనైః
పూజయే త్స్వేష్టదేవస్య త్వేకస్యావరణేన చ॥

తా॥ విగ్రహము, యంత్రము, లింగము, సాలగ్రామము మున్నగు వానితో తన ఇష్టదేవునకు ఒకే ఆవరణమున పూజ చేయనగును.

శ్లో॥ నా న్యావరణపూ జేతి - కథితం రుద్రయా స్వయం

తా॥ అన్యావరణ పూజ ప్రత్యేకమున లేదని రుద్రదేవతా వాక్యము.

శ్లో॥ చంద్ర సూర్యోపరాగేషు - హ్యర్ధోదయ మహోదయే
సంక్రాంతిషు వ్యతీపాతే - జపిత్వా విధినా మనుమ్॥

తా॥ చంద్ర సూర్యగ్రహణములందు, అర్ధోదయము (సూర్యుని యొక్క లేదా చంద్రుని యొక్క మండలము సగముదయించుట - పుష్య మాఘ మాసములలో అమావాస్య, ఆదివారము, శ్రవణ నక్షత్రము, వ్యతీపాతయోగమును కలసిన యోగము) నందు, మహోదయమునందు, ఆయారాశుల సంక్రమణములందు, వ్యతీపాత యోగమునందు యథా విధిగా మంత్రమును జపించి

శ్లో॥ పాయ సాపూప హవిషా - పుష్పైః త్రిమధునా ప్లుతైః
తండులై స్తిలమిశ్రై ర్వా - హోమకర్మ సమాచరేత్॥

తా॥ పాయసము, అపూపములు, హవిస్సు, త్రిమధువులగు తేనె చక్కెర, నేయి అను వానితో ముంచిన పుష్పములతోను, నువ్వులతోను కూడిన బియ్యముతో గాని హోమమునొనర్చవలెను,

శ్లో॥ ఏకవారం జపే ద్యస్తు - న కోటిగుణితం లభేత్
సకృ ద్ధోమవిధానేన - కోటిహోమఫలం లభేత్॥

తా॥ ఒక్కమారు పై రీతిగా జపించుటచే అది కోటి పర్యాయములు చేసినట్లగును. ఒక్కమాటుగా హోమమొనర్చుటవలన కోటి సువర్ణములు హోమమొనర్చిన ఫలితము లభించును.

శ్లో॥ ఆత్మశ క్త్యనుసారేణ - గురుపూజాపి దక్షిణా
అనంతఫలదా ప్రోక్తా - ఇ త్యేవం మునయోఽబ్రువన్॥

తా॥ తన శక్తిననుసరించి గురుపూజ, గురుదక్షిణల నొసగిన అది అనంత ఫలితముగా చెప్పబడినది అని ఈ రీతిగా మునులు పల్కిరి.

శ్లో॥ అన్య ద్విశేషం వక్ష్యా మి- శృణుష్వ మునిపుంగవః

తా॥ ఓ మైత్రేయమహామునీ! ఇంకొక విశేషమునుచెప్పుచున్నాను. వినవలసినది.

వ॥ అస్య శ్రీ ఆంజనే యానుష్టుభ మహామంత్రస్య
ప్రజాపతి ఋషిః గాయత్రీ ఛందః శ్రీ
హనుమా న్దేవతా మర్కటేశ ఇతి బీజం
అచ్యుత ఇతి శక్తిః కపిరాజ ఇతి కీలకం
మమ శ్రీహనుమత్ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః
మూలమంత్రేణ కరశుద్ధి వ్యాపక న్యాసం కుర్యాత్॥

ధ్యానం-

శ్లో॥ హయ కపి గరుడాస్యం - క్రోడ సింహాననం చ
దశభుజ పరిఘా ఽహి ఖడ్గ ఖట్వాంగ పాశం
గిరి కులిశ త్రిశూలం మౌసలం చాంకుశం చ
ధృత కరవర ము ష్టిం ప్రేతసంస్థాన భూషమ్॥

తా అశ్వవానరగరుడ వరాహ సింహముఖములు కలవాడును, పదిచేతులందు ఇనుపకట్లగుది, పాము, కత్తి మంచపుకోడు, పాశము,

పర్వతము, వజ్రాయుధము, త్రిశూలము, రోకలి, అంకుశము మున్నగునవి ధరించినవాడును, ఒంటె వాహనముగా కలవాడును ప్రేత సంస్థానమున ఘూష ప్రాయముగా నున్నవాడును.

శ్లో॥ అరుణవదన రూపం - రక్త మాల్యాంగ కాంతిం
స్మరతి రిపుజయార్థం - సర్వసంప త్సమృద్ధ్యై॥

తా॥ ఎఱ్ఱని మూతికలవాడును, రక్తమాల్యమువంటి దేహకాంతి కలవాడును అగు హనుమంతుని సర్వసంపదలు సిద్ధించుటకు, శత్రువులను జయించుటకొఱకు స్మరించుచున్నాడు.

మనుః—

శ్లో॥ మర్కటేశ మహోత్సాహ సర్వశోక నివారక
శత్రూన్ సంహర మాం రక్ష - శ్రియం దాపయ మే ప్రభో
శ్లో॥ అయుతం తు పురశ్చర్యా - దశాంశం తర్పయే ద్బుధః
తద్దశాంశం హునే త్పశ్చాత్ - పాయసం మధుమిశ్రితమ్॥

తా॥ పై మంత్రమునకు పదివేల పర్యాయములు పురశ్చర్య విధింపబడినది. అందుపదవవంతు తర్పణ మొనర్చవలెను. పిదప అందు పదవవంతు హోమము గావింపవలెను. ఆ హోమము మధుమిశ్రితమైన పాయసముతో చేయవలెను.

శ్లో॥ ఉపాసనాకృతా పూర్వం - బహుభి ర్మునిసత్తమైః

తా॥ అనేక ముని శ్రేష్ఠులచే పూర్వమీ మంత్రము ఉపాసింపబడినది.

శ్లో॥ అనుష్టుభ మిదం శ్రేష్ఠం అంజనేయమనుం మునే
సప్తకోటి మహామంత్ర శ్రేష్ఠ శ్రేష్ఠతరం విదుః॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! ఈ అంజనేయుని అనుష్టుప్ మంత్రమును సప్తకోటి మహామంత్రములందు శ్రేష్ఠమైనదిగా తెలియుదురు.

శ్లో॥ సప్తమంత్రాత్మికా విద్యా - పంచవక్త్ర హనూమతః
సప్తకోటి మహామంత్ర — జాలే శ్రేష్ఠేతి నారదః॥

తా॥ పంచముఖాంజనేయుని సప్తమంత్రాత్మక విద్య సప్తకోటి మహామంత్రములన్నింట శ్రేష్ఠమైనదని నారదుడు చెప్పెను.

శ్లో॥ సప్తమంత్రస్థ వర్ణానాం - షణ్ణవ త్యుత్తరే శతి
ఏకైక మక్షరం ప్రోక్తం - ఏకైక మనుసంజ్ఞయా॥

తా॥ ఏడు మంత్రములందుకల నూట తొంబదియారు అక్షరలములో ప్రతియొక్క అక్షరము ఒక మంత్రముగా చెప్పబడినది.

శ్లో॥ ఋషి న్యాస శ్చ దేవ శ్చ - ఛందో ధ్యాన ముపాసనా
ఏకైకాక్షర మంత్రాణా మేతే సర్వే సమా స్మృతాః॥

తా॥ ఏకైకాక్షర మంత్రములన్నిటికి ఋషి, న్యాసము, అధిదేవత, ఛందస్సు, ధ్యానము, ఉపాసన అన్నియు సమానముగా చెప్పబడినవి.

శ్లో॥ సప్తమంత్రాత్మికా తుల్యా - విద్యా నాస్తి జగత్త్రయే
హనుమ త్సదృశం దైవం - న భూతో న భవిష్యతి॥

తా॥ సప్తమంత్రాత్మక విద్యతో సమానమైన మంత్రవిద్య ముల్లోకములందులేదు, హనుమంతునితో సమానమైన దైవము కూడ వెనుకలేదు, ముందు రాబోదు.

శ్లో॥ సప్తకోటి మహామంత్ర సారం సంగృహ్య శంభునా
సప్తమంత్రాత్మికా విద్యా — కృతా లోకహితాయ వై॥

తా॥ సప్తకోటి మహామంత్రముల సారము సంగ్రహించి పరమేశ్వరునిచే లోక శ్రేయస్సుకొఱకై సప్తమంత్రాత్మక విద్య చేయబడినది.

శ్లో॥ అతో విద్యా మిమాం యే తు - పఠంతి ద్విజసత్తమాః
సప్తకోటి మహామంత్రాన్ - తే పఠంతి న సంశయః॥

తా॥ కావున ఈ సప్తమంత్రాత్మకవిద్యను ఏ శ్రోత్రియులుపఠింతురో వారు సప్తకోటి మహామంత్రములను పఠించినట్లే.

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి - హోమ కర్మణి చోదితం
స్వాహాకారం తు హోమాంతే - పఠే ద్విద్వా నతంద్రితః॥

తా॥ హోమ కర్మయందు చెప్పబడిన వేఱొక విశేషమును చెప్పుచున్నాను. బుద్ధిశాలియగువాడు హోమమునకు చివఱ స్వాహాకారమును తొట్రుపాటులేక చెప్పవలెను.

శ్లో॥ తర్పయా మీతి వచనం తర్పణాంతే సముచ్చరేత్
హోమతర్పణయో రంతే - జయద్వంద్వం పునఃపునః॥

తా॥ తర్పణమునకు చివఱ తర్పయామి అను వచనము నుచ్చరింపవలెను. హోమతర్పణములకు చివఱ మరల మరల జయద్వంద్వము అనగా జయజయ అని పలుకవలెను.

శ్లో॥ మంత్రాణాం బలసిద్ధ్యర్థం - యశశ్శ్రే యోపసిద్ధయే
ఉక్తాగమవిధానజ్ఞైః - కథితం మునిసత్తమైః॥

తా॥ మంత్రములకు బలము ఏర్పడుటకు, కీర్తి, శ్రేయస్సు కల్గుటకును అట్లు పలుకవలెనని ఆగమ విధానమెరిగిన మునిశ్రేష్ఠులచే చెప్పబడినది.

శ్లో॥ అన్యం విశేషం వక్ష్యామి - పల్లవార్థం మునీశ్వర!
సర్వేషా మపి మంత్రాణాం - మంత్రాంతే పల్లవం న్యసేత్॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! పల్లవముల గూర్చి వేరొక విశేషమును చెప్పుచున్నాను. అన్ని మంత్రములందును మంత్రమునకు చివర పల్లవమును చెప్పవలెను.

శ్లో॥ కేషాంచి దేవ మంత్రాణా - మాదౌ పల్లవ ఈరితః
ఆదా వంతే చ కేషాంచిత్ - పల్లవద్వయ మిష్యతే॥

తా॥ కొన్ని మంత్రములకే మంత్రాదిని పల్లవము చెప్పబడినది. కొన్ని మంత్రములకు మంత్రాదిని, మంత్రాంతమున రెండు పల్లవములు

చెప్పవలెను. ఈ పల్లవములగూర్చి పూర్తి వివరము శ్రీ పరాశర సంహిత నాల్గవ పారిజాతమున పందొమ్మిదవ పటలమున గలదు,

శ్లో॥ పల్లవద్వయ సంబంధాత్ - ప్రత్యవాయో న విద్యతే
ఆద్యంత పల్లవ స్పర్శ - తంత్రాణా ముత్తమోత్తమమ్॥

తా॥ రెండు పల్లవములను చెప్పుటవలన ఏ దోషము లేదు. ఆదిని, అంతమున పల్లవములను చెప్పుట తంత్ర విధానమున ఉత్తమోత్తమము.

శ్లో॥ మహా భైరవ కల్పే - సంప్రోక్తం మునిపుంగవైః
సర్వేషా మపి మంత్రాణాం - పల్లవేన త్వపి స్ఫుటమ్॥

తా॥ ఈ విషయము మహాభైరవ కల్పమునందు మునిశ్రేష్ఠులచే చెప్పబడినది. అన్ని మంత్రములకు పల్లవము వలన స్పష్టతచేకూరును.

శ్లో॥ హోమార్థే షట్ప్రయోగార్థే - యోజయే త్పల్లవం పునః
పునః పల్లవసంయోగాత్ - ప్రత్యవాయో న విద్యతే॥

తా॥ హోమవిషయమున షట్ప్రయోగముకొఱకు మరల పల్లవమును కూర్చవలెను, మరల పల్లమును చెప్పుటవలన ప్రత్యవాయము కలుగదు.

శ్లో॥ జపం తర్పణ హోమం చ - ద్విజసంతర్పణం తథా
చతుర్విధ మిదం బ్రహ్మన్ - మంత్రాంగాః పరికీర్తితాః॥

తా॥ జపము, తర్పణము, హోమము, శ్రోత్రియులకు సమారాధనము అను నాల్గును ఓ బ్రహ్మర్షీ! మంత్రాంగములుగా కీర్తింపబడినవి.

శ్లో॥ అంగభంగో భవే ద్యత్ర - త త్సంఖ్యా ద్విగుణో జపః
సర్వ తంత్రరహ స్యేమం - ఇత్యుక్తం మంత్రవేదిభిః॥

తా॥ పైమంత్రాంగములందు ఏ అంగమునయిన నిర్వహింపకున్నచో ఆ సంఖ్యకు రెండు రెట్లుగ జపముచేయవలెను. ఇట్లుసర్వతంత్ర రహస్యమున మంత్రవేత్తలచే చెప్పబడినది.

శ్లో॥ సాలగ్రామే తథా లింగే - పూజయిత్వా న్యదేవతాం
ఉభాభ్యాం శాప మాప్నోతి - వ్యాధిగ్రస్తో న సంశయః॥

తా॥ సాలగ్రామమునను, లింగమునను ఒక దేవతకు బదులు వేరొక దేవతను పూజించినచో ఇద్దరు దేవతల శాపమునకు గురియై తప్పక వ్యాధిగ్రస్తుడు కాగలడు.

శ్లో॥ హనూమ న్మంత్రజాలానా - మిత్యుక్తం శంభునా పురా
జపాంతే ఖలు వక్తవ్యాన్ - శ్లోకాన్ శృణు మహామునే!

తా॥ హనుమంతుని మంత్రములయెడ పై విషయములన్నియు పూర్వము మహేశునిచే చెప్పబడినవి. ఓ మహామునీ! జపాంతమున చెప్పదగు శ్లోకములను చెప్పుచున్నాను వినుము.

శ్లో॥ గోప్తృణా మపి గోప్తాత్వం - గృహా ణాస్మత్కృతం జపం
సిద్ధిం కురుష్వ మే దేవ! త్వా మహం శరణం గతః॥

తా॥ రహస్యములలో కెల్ల రహస్యమైన ఈ నా జపమును స్వీకరింపుము. ఓ దేవా! నాకు మంత్రసిద్ధిని ప్రసాదింపుము. నిన్ను నేను శరణు వేడుచున్నాను.

శ్లో॥ ఆవాహనం న జానామి - న జానామి విసర్జనం
పూజావిధిం న జానామి - క్షమస్వ హనుమత్ప్రభో!

తా॥ ఓ హనుమత్ప్రభూ! నాకు ఆవాహనము తెలియదు. నాకు విసర్జనము తెలియదు. పూజా విధానము కూడ తెలిసినవాడను కాను. మహానుభావా! నన్ను క్షమింపుము.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయసంవాదే నిత్యకర్మవిధి ర్నామ
సప్తషష్టితమః పటలః

# శ్రీ పరాశర సంహితా

## అష్టషష్టితమః పటలః

## చక్రలక్షణకథనం

శ్రీ పరాశరః:—

శ్లో॥ మంత్రాంతరం ప్రవక్ష్యామి - శృణుష్వ మునిపుంగవ।

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయ మహా మునీ! వేరొక మంత్రమును చెప్పుచున్నాను వినవలసినది.

శ్లో॥ ఆదౌ ప్రణవ ముచ్చార్య – రామదూతాయ చోచ్చరేత్
లంకావిధ్వంసనా యేతి - వహ్నిజాయాం సముచ్చరేత్॥

తా॥ మొదట 'ఓం' అని ప్రణవమునుచ్చరించి పిదప 'రామ దూతాయ' అని ఉచ్చరించవలెను. 'లంకా విధ్వంసనాయ' అని చెప్పి చివట 'స్వాహా' అను పదము పలుకవలెను.

శ్లో॥ సర్వ సంపత్ప్రదా నృణాం - ఏషా పంచదశాక్షరీ
ఋషి రస్య మనో ర్బ్రహ్మ - గాయత్రీ ఛంద ఇష్యతే॥

తా॥ నరులకు సర్వసంపద లొసంగజాలిన ఈ మంత్రము పంచ దశాక్షరీ మంత్రము. ఈ మంత్రమునకు బ్రహ్మయే ఋషి. గాయత్రి ఛందస్సు.

శ్లో॥ హనుమా న్దేవతా ప్రోక్తా - ప్రణవో బీజ ముచ్యతే
శక్తి శ్చ వహ్నిజాయా తు - రామదూతాయ కీలకమ్॥

తా॥ ఈ మంత్రమునకు హనుమాన్ దేవతా! ఓం బీజం స్వాహా శక్తి. రామదూతాయ కీలకం అని తెలిసికొననగును.

శ్లో॥ వినియోగపదం చోక్త్వా - దేవతానుగ్రహ కాంక్షయా
న్యాసం కృత్వా ప్రయత్నేన - మూలమంత్రేణ చైవ హి॥

తా॥ దేవతానుగ్రహ కాంక్షయందు వినియోగముచెప్పి మూల మంత్రముతోనే న్యాసమొనర్పవలెను.

ధ్యానం -

శ్లో॥ య స్తృణీకృత బ్రహ్మాస్త్ర - సార స్సర్వసురార్చితః
శౌర్య సర్వంకష ప్రజ్ఞ - స్తం వందే వాయునందనమ్॥

తా॥ బ్రహ్మాస్త్ర సారమునుకూడ తృణీకరింపజాలినవాడు, దేవతలందరిచే అర్చింపబడువాడు, శౌర్యముచేత అందరను ఒరిపిడిపెట్టగల ప్రజ్ఞకలవాడును అగు వాయుకుమారునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ అథ యంత్రం ప్రవక్ష్యామి - చక్రాణా ముత్తమోత్తమం
ఆదౌ చంద్రం సమాలిఖ్య - షట్కోణాం విలిఖే త్తతః॥

తా॥ పిమ్మట చక్రములలో ఉత్తమోత్తమమైన యంత్రమును చెప్పుచున్నాను. మొదట చంద్రమును లిఖించి పిదప ఆరుకోణములను లిఖింపవలెను.

శ్లో॥ త ద్బహి ర్వృత్త మాలిఖ్య - అష్టపత్రం లిఖే త్తతః
పున ర్వర్తుల మాలిఖ్య - భూపురద్వయ మాలిఖేత్॥

తా॥ దానికి బయట వృత్తమునుగీచి పిదప ఎనిమిదిదళములను గీయవలెను. మరల వృత్తమునుగీచి భూపుర ద్వయమును లిఖింపవలెను.

శ్లో॥ మంత్రరాజ మనుం తత్ర - ప్రా గక్షరా ణ్యనుక్రమాత్
ప్రణవాది లిఖే న్మధ్యే - మంత్రవర్ణం లిఖే త్తతః॥

తా॥ అచట తూర్పునుండి అక్షర క్రమముతో మంత్రాక్షరములను లిఖింపవలెను. మధ్యభాగమున ప్రణవాదికము లిఖించి పిదప మంత్ర వర్ణములను వ్రాయవలెను.

శ్లో॥ పూర్వకోణం సమారభ్య - షట్కోణేషు లిఖే త్సుధీః
విలిఖే దష్టపత్రేషు - హ్యష్టవర్ణాన్ లిఖే త్తతః॥

తా॥ తూర్పున ఉన్నకోణము మొదలుకొని విజ్ఞుడు ఆరుకోణములందు లిఖింపనగును. పిదప ఎనిమిది అక్షరములను ఎనిమిది పత్రములందు లిఖింపలెను.

శ్లో॥ స్వరాన్ షోడశ సంగృహ్య - విలిఖే ద్భూపుర ద్వయే

తా॥ అచ్చులు పదునారింటిని భూపురద్వయమున లిఖించవలెను.

శ్లో॥ సౌవర్ణే రజతే వాపి - తామ్రే వాపి విశేషతః
భూర్జే వా తాళపత్రే వా - విలిఖే చ్చక్ర ముత్తమమ్॥

తా॥ బంగరురేకుపై కాని, వెండిరేకునకాని విశేషించి రాగిరేకుపై కాని, భూర్జరి పత్రముపైకాని, తాళపత్రముపైకాని ఉత్తమమగు యంత్రమును లిఖింపవలెను.

శ్లో॥ ప్రాణప్రతిష్ఠాం కృత్వా తు - సుగంధ కుసుమాక్షతైః
మల్లికా జాజి పుష్పై శ్చ కరవీరై శ్చ చంపకైః॥

తా॥ ప్రాణప్రతిష్ఠనొనర్చి మంచిగంధము, పూలు, అక్షతలతోను మల్లె, జాజి, కరవీరము, సంపెంగ మున్నగుపూలతోను

శ్లో॥ శైవే వా వైష్ణవే పీఠే - ప్రత్యహం పూజయే జ్జనః
నియమేన సదా కుర్యాత్ - తత్ర లక్ష్మీ రచంచలా॥

తా॥ శైవపీఠమునకాని వైష్ణవ పీఠమునకానియుంచి ప్రతిరోజు పూజింపవలెను. ఇట్లు ఎల్లప్పుడు నియమముతో చేసిన అచ్చట సంపద స్థిరముగ నుండును.

శ్లో॥ శిఖాయాం మధ్య వా కంఠే - దక్షిణే వ్యథ వా కరే
కట్యాం చ ధారయే న్మర్త్యః - కందర్ప సదృశో భవేత్॥

తా॥ శిఖామధ్యమున కాని కంఠమునకాని లేదా కుడిచేతియందు కాని కటిప్రదేశమునకాని జనులు ధరించిన మన్మథ సమానులుగా అయ్యెదరు.

శ్లో॥ భూత ప్రేత పిశాచాద్యా - బేతాళ బ్రహ్మరాక్షసాః
దూరా దేవ పలాయంతే - చక్రరాజస్య దర్శనాత్॥

తా॥ ఆ యంత్రమును చూచుటవలన భూత ప్రేత పిశాచాదులు బేతాళ బ్రహ్మరాక్షసులు దూరమునుండియే పరుగిడిపోవును.

శ్లో॥ రాజద్వారే సభామధ్యే - వ్యాఘ్ర సింహ భయేషు చ
తస్య క్వాపి భయం నాస్తి - సత్యం సత్యం తపోధన॥

తా॥ ఈ యంత్రము ధరించిన వానికి రాజద్వారమునకాని, సభా మధ్యమున కాని, పులి, సింహములకడ కాని ఎచ్చటను భయములేదు. ఓ తపోధనుడా! ఇది ముమ్మాటికి నిజము.

శ్లో॥ గ్రహణేషు స్పృశన్ విద్యా - మష్టాక్షర మహామనుం
అష్టోత్తర సహస్రం వా అష్టోత్తర శతాదికం
వీర్యసిద్ధిం ప్రకుర్వీత -జపం కుర్వీత బుద్ధిమాన్॥

తా॥ గ్రహణసమయములందు యంత్రమును తాకుచు అష్టాక్షర మహామంత్రమును వేయియెనిమిది పర్యాయములు కాని లేదా నూట యెనిమిది పర్యాయములు కాని జపించవలెను. యంత్రమునకు వీర్య సిద్ధికై అట్లు బుద్ధిశాలియగువాడు జపమొనర్చవలెను.

శ్లో॥ మందవారే చ మధ్యాహ్నే - పూజయేచ్చ ప్రయత్నతః
నైవేద్యం చ ఫలా పూపాన్ - మధురా న్ఘృతాన్వితాన్॥

తా॥ ప్రయత్నపూర్వకముగా ఆ యంత్రమునకు శనివారము మధ్యాహ్నసమయమున పూజచేయవలెను. నైవేద్యముగా పండ్లను, మధురములై ఆవునేతితోచేసిన అప్పములు మున్నగుపిండివంటలను,

శ్లో॥ కదళీ చూత పనసైః - ఖర్జూర ఫల సంయుతం
బ్రాహ్మణాన్ పంచసంఖ్యాకాన్ - యథేష్టం భోజయే త్తతః॥

తా॥ అరటి, మామిడి, పనస, ఖర్జూరములను సమర్పింపవలెను, పిదప ఐదుగురు బ్రహ్మణులకు సమారాధన మొనర్పవలెను.

శ్లో॥ గురుం సంపూజ్య యత్నేన - గృహ్ణీయా చ్చక్ర ముత్తమం
గురుపత్నీ మలంకృత్వా - వస్త్రాలంకరణాదిభిః॥

తా॥ ప్రయత్నపూర్వకముగా గురుదేవులను పూజించి వస్త్రములు, ఆభరణములు మున్నగువానితో గురుపత్నిని అలంకరించి ఉత్తమమగు యంత్రమును స్వీకరించవలెను.

శ్లో॥ అమూల్య వస్త్ర కంచుకై - ర్గంధపుష్పాక్షతాదిభిః
తోషయిత్వా నమస్కృత్వా శ్రియం మనసి భావయేత్॥

తా॥ అమూల్యమైన వస్త్రకంచుకములతోను, గంధపుష్పాక్షతాదుల తోను సంతోషపరచి నమస్కరించి మనసున సంపదను భావింపవలెను.

శ్లో॥ మహా దైశ్వర్య మాప్నోతి - కల్పాయుష్య మవాప్నుయాత్
పాపసంఘా న్వినిర్జిత్య హనూమత్పద మాప్నుయాత్॥

తా॥ ఈ రీతిగా గొప్ప ఐశ్వర్యమును. కల్పపర్యంతము ఆయు ర్దాయమును పొందగల్గును. అతడు పాపములన్నిటిని తొలగజేసికొని హనుమత్పధ సన్నిధికి చేరును.

శ్లో॥ సర్వస్వదక్షిణా దేయా వస్త్రాలంకరణాదిభిః
భూదానం కారయే ద్విద్వా నైశ్వర్యాపేక్షయా ద్విజః

తా॥ వస్త్రాలంకరణాదులతో సర్వస్వము దక్షిణగా నొసంగ వలెను, ఓ మైత్రేయా! ఐశ్వర్యము కోరువాడు భూధాన మొనర్చవలెను.

శ్లో॥ సువర్ణకోటి సాహస్రం - శక్త్యర్ధాతుం న చే ద్బుధః
కర్షమాత్ర సువర్ణం వా - నిష్కమాత్ర మథాపి వా॥

తా॥ శక్తిని పెంపొందించుటకొఱకు వేయికోట్ల సువర్ణ నాణెముల నొసంగవలెను. లేకున్న ఇరువదిచిన్నముల ఎత్తు బంగారమును, అదియు కాకున్న ఒకమాడ మాత్రపు బంగారమయినను

శ్లో॥ అర్పయే ద్గురవే విద్వాన్ - న శక్యం వర్ణితుం ఫలమ్॥

తా॥ గురువుగారికి సమర్పింపవలెను. అందువలన చేకూరు ఫలితము వర్ణింపశక్యముకాదు.

శ్లో॥ అశ్వ మాందోళికం వాపి - గురవే య స్సమర్పయేత్
చక్రవర్తీ భవే ద్రాజా - సర్వద్వీపాధిప స్స్వయమ్॥

తా॥ గురుదేవునకు ఏరాజు గుఱ్ఱమునుకాని పల్లకినికాని సమ ర్పించునో అతడు స్వయముగా సర్వద్వీపములకు అధిపతియై చక్రవర్తి యగును.

శ్లో॥ బహునాత్ర కి ముక్తేన - గురుం సంపూజ్య యత్నతః
మనసా చింతితం కామం - ప్రాప్నో త్యేవ న సంశయః॥

తా॥ ఈ విషయమున ఎక్కువగా చెప్పనేల? ప్రయత్న పూర్వకముగా గురువును సంపూజించి మనసున దేనిని కోరుకొనునో దానిని తప్పక పొందగల్గును. ఇందు సందేహములేదు.

శ్లో॥ వంచయే ద్యది మూఢాత్మా - గురుం దైవతరూపిణం
ఇహ చానర్థ మాప్నోతి - పరే చ నరకం వ్రజేత్॥

తా॥ దైవ స్వరూపుడగు గురువును ఏమూఢాత్ముడు మోసగించునో ఆతడు ఇహమున అనర్థము పొందును. పరమున నరకము ననుభవించును.

శ్లో॥ య త్కించి దపి దాతు శ్చే దశక్తః పురుషో గురోః
సేవయా వా నమస్కారైః - తోషయే త్తాం కృపానిధిమ్॥

తా॥ గురుదేవులకు ఏమాత్రమొసంగుటకును శక్తిలేని జనుడైనచో సేవ చేయుటద్వారాకాని, నమస్కారాదుల వలనకాని ఆదయామడగు గురువును సంతోషపెట్టవలెను.

శ్లో॥ విశ్వాసరహితో య స్తు - స్వయం వర్తేత సాధకః
న దుష్టః కీటవ ల్లోకే - సంశయో న వినశ్యతి॥

తా॥ విశ్వాసరహితుడై ఎవడు సాహంకారముగా వర్తిల్లునో అట్టి సాధకుడు దుష్టుడై కీటకమువలె లోకమున నశించును. సంశయములేదు.

శ్లో॥ బహునాత్ర కి ముక్తేన - విత్తశాఠ్య వివర్జితః
పూజయే ద్దేశికం మంత్రీ - తోషయే ద్వాపి సేవయా॥

తా॥ పెక్కుమాటలేల? ధనలోభమును వీడి మంత్రజ్ఞుడగువాడు గురువును పూజింపవలెను. లేదా సేవచే సంతృప్తుని చేయవలెను.

శ్లో॥ గురుం ప్రకాశయే ద్ధీమాన్ - మంత్రం యత్నేన గోపయేత్
గురుభక్తి ర్మంత్రగుప్తి ర్ద్వయం సిద్ధిప్రదం నృణామ్॥

తా॥ బుద్ధిమంతుడగువాడు గురువును గొప్పగా తెలుపుకొనవలెను. ప్రయత్నపూర్వకముగా మంత్రమును మాత్రము రహస్యముగా నుంచవలెను. నరులకు గురుభక్తి, మంత్రమును రహస్యముగా నుంచుట అను రెండే ముఖ్యముగా సిద్ధినొసంగజాలిన కర్తవ్యములు.

శ్లో॥ గురు ర్మంత్రో దేవతా చ - త్రయ మేవ పరం స్మృతాః
తత్రాపి దేశిక శ్శ్రేష్ఠః - తమే వారాధయే త్సుధీః॥

తా॥ గురువు, మంత్రము దేవత అను మూడే ప్రధానమైనవి. అందునను మంత్రముచెప్పిన గురువే శ్రేష్ఠుడు. కావున విజ్ఞుడగు వాడు ఆ గురువునే ఆరాధింపవలెను.

శ్లో॥ గురౌ తుష్టే జగ త్తుష్టం - సంతుష్ట స్సర్వసిద్ధిదః
దేవే రుష్టే గురు స్త్రాతా - గురౌ రుష్టే న కశ్చన॥

తా॥ గురువు సంతోషించిన జగత్తంతయు సంతోషించినట్లే. అట్లు సంతోషించిన గురువు సర్వము నీయగలడు. దేవుడు కోపగించిన గురువు రక్షింపగలడు. ఆ గురువే కోపగించినచో రక్షింపగలవాడెవ్వడు లేడు.

శ్లో॥ కృతఘ్న శ్చ గురుద్రోహీ - న నిష్కృతి మవాప్నుయాత్

తా॥ కృతఘ్నునకు, గురుద్రోహమొనర్చినవానికి, ఇక నిష్కృతి లేదు.

శ్లో॥ ఉత్సవేషు చ సర్వత్ర - వ్రతేషు హనుమత్ప్రభోః
గురుపూజా చ కర్తవ్యా - భక్తి విశ్వాస పూర్వకమ్॥

తా॥ హనుమంతునకు సంబంధించిన అన్ని ఉత్సవములందును, అన్ని వ్రతములందును భక్తి విశ్వాసపూర్వకముగా గురుపూజను తప్పక ఆచరింపవలెను.

శ్లో॥ గురుం మంత్రోపదేష్టారం - వంచయిత్వా నరాధమః
శ్వానయోనిశతం గత్వా - పిశాచత్వ మవాప్నుయాత్॥

తా॥ మంత్రోపదేశమొనర్చినగురువును మోసగించిన నీచ మనుజుడు నూరు పర్యాయములు కుక్కగా జన్మించి తుదకు పిశాచమగును.

శ్లో॥ నిర్జనే విపినే ఘోరే – విచ్ఛాయే కంటకావృతే
క్షుత్పిపాసా సమాక్రాంతః – కల్పానా మయుతం వసేత్॥

తా॥ అట్టివాడు మనుష్యులు సంచరించని, నీచమై ముళ్ళతో నిండిన ఘోరమైన అరణ్యమున అకలి దప్పికలతో పీడింపబడువాడై పదివేల కల్పముల కాలము వసించును.

శ్లో॥ పునశ్చ సద్గురో రేవ – కృపయా స విముచ్యతే
మంత్రం వా కవచం వాపి స్తోత్రం వా న్యాస మేవ వా
ఉపదేక్షతి య స్సోపిహి గురు రి త్యుచ్యతే బుధైః॥

తా॥ అట్టివాడు మరల సద్గురువుయొక్క దయవలననే విముక్తి నందును. మంత్రమునుకాని కవచమునుగాని, స్తోత్రమునుగాని, న్యాసమైనను ఎవ్వరు ఉపదేశింతురో వారు గురువులని విజ్ఞులచే చెప్పబడుదురు.

శ్లో॥ తస్యా వమానకో మర్త్యో – నరకా యైవ జీవతి
తస్యానువర్తనా దేవ జీవ న్ముక్తో న సంశయః॥

తా॥ అట్టి గురువునవమానించు మనుష్యుడు నరకమనుభవించుటకే జీవించును. ఆ గురువుననుసరించి వర్తించుటవలననే నిస్సందేహముగా జీవన్ముక్తుడు కాగలడు.

శ్లో॥ ఉపదేశం వినా మంత్రం – దేశికస్య జపే ద్యది
అతిలోభేన మోహేన పిశాచత్వ మవాప్నుయాత్॥

తా॥ గురువియొక్క ఉపదేశములేకయే మంత్రమును జపించినచో అట్టివాడు అతిలోభమున,మిక్కిలి మోహమునను పిశాచత్వము పొందును.

శ్లో॥ గురౌ దేశాంతరస్థౌ తు దేవ మారాధ్య సాధకః
నివేద్య పరమాన్నం చ – పూజయిత్వా తథా మనుమ్
గురుపాదౌ నమస్కృత్య – జపే న్మంత్రం న దోషభాక్॥

తా॥ గురుదేవులు అన్య ప్రదేశమున నున్నచో మంత్రసాధకుడగు వాడు దేవుని అరాధించి పూజసల్పిన పిదప పరమాన్నమును నివేదించి గురుపాదములకు నమస్కరించి మంత్రమును జపించవలెను. అందు దోషములేదు.

శ్లో॥ అన్య ద్రహస్యం వక్ష్యామి - మంత్రరాజస్య ముత్తమం
శృణు మైత్రేయ విప్రేంద్ర - లోకానా ముపకారకమ్॥

తా॥ ఓ మైత్రేయా! ఇంకొక రహస్యమైన మంత్రశ్రేష్ఠమును ఉత్తమమైనదానిని చెప్పుచున్నాను. లోకములకుపకార కారణమైన దానిని వినుము.

శ్లో॥ మంత్రాక్షరాణాం చానుక్తౌ తారత్రయ ముదీరయేత్
బీజాక్షరాణాం చానుక్తౌ నా మాద్యక్షర ముచ్చరేత్॥

తా॥ మంత్రాక్షరములు చెప్పబడకున్నచో తారత్రయము పలుకవలెను. బీజాక్షరములు చెప్పబడకున్నచో నామాద్యక్షరములనే ఉచ్చరించవలెను.

శ్లో॥ స్వాభీష్ట మంత్ర స్యైకస్య - యథాశాస్త్రం జపం భవేత్
ఇతరేషాం తు మంత్రాణాం - యథాశక్తి ర్జపం చరేత్॥

తా॥ తన ఇష్టమంత్రమునకు శాస్త్రోక్త విధిననుసరించి జపము చేయవలెను. ఇతర మంత్రములకు యథాశక్తిగా జపమొనర్చవలెను.

శ్లో॥ న తత్ర న్యూనతా దోషో నాధిక్యేనాపి దోషభాక్
ఇతి మంత్రవిదాం రీతి రితి శాతాతపో బ్రవీత్॥

తా॥ ఆ విషయమున తక్కువ, ఎక్కువలు చేసిన దోషము కలుగదు. అని మంత్రవేత్తల పద్ధతిగా శాతాతపుడు పల్కెను.

శ్లో॥ సాకారే చ వకారే చ హాకారే హోమ మాచరేత్
హోతవ్యం జుహుయా దగ్నౌ - స్వాహాకారం సముచ్చరేత్॥

తా॥ సాకారముతోను, వకారముతోను, హాకారముతోను అనగా స్వాహాకారముతో అగ్నియందు హోమము చేయవలెను. కావున స్వాహాకారము ఉచ్చరింపవలెను.

శ్లో॥ ఉచ్చార్యోపరతో భూత్వా - న హూయా ద్ధవి రంతతః
వ్యవధానే హోమవిధౌ - రాక్షసాః ప్రీతి మాప్నుయుః॥

తా॥ ఉచ్చరించి ఆపివేసినపిదప చివఅకు హోమము చేయరాదు. వ్యవధానముతో హోమము చేయుచుండుటవలన రాక్షసులు తృప్తులౌదురు.

శ్లో॥ జప్యం భ్రూమధ్య దృష్ట్యా వా - నాసాగ్రస్య దృశాపి వా
వర్ణమాలా దృశా వాపి - జపన్ సిద్ధి మవాప్నుయాత్॥

తా॥ కనుబొమలమధ్య దృష్టినుంచి కాని, ముక్కుచివర దృష్టి నుంచికాని వర్ణమాలపై దృష్టినుంచికాని జపించుచు సిద్ధినందదగును.

శ్లో॥ అంతర్లక్ష్యో బహిర్దృష్టిః - ధ్యాయే త్కపివరం హృది

తా॥ మనసున లక్ష్యముంచి దృష్టి బయటనుంచి హృదయమున కపిశ్రేష్ఠుడగు హనుమంతుని ధ్యానింపనగును.

శ్లో॥ స్వేష్టదైవత గాయత్రీ - ముద్రా స్తుస్య యథావిధి
సూక్తం సహస్రనామాని - చక్ర మిత్యేవ పంచకమ్॥

తా॥ తన ఇష్టదైవముయొక్క మంత్రగాయత్రీ, యథావిధిగా ముద్రలు, సూక్తము, సహస్రనామములు, యంత్రము అనునవి ఐదును

శ్లో॥ దైవప్రసాదమూలత్వాత్ - మూలమంత్రస్య సిద్ధయే
మూలపంచక మేవేతి - కథితం మంత్రవిత్తమైః॥

తా॥ దైవానుగ్రహ మూలకములగుటవలన మూలమంత్రసిద్ధి కొఱకు ఈ యైదును మూలపంచకముగా మంత్రవేత్తలచే చెప్పబడినది.

శ్లో॥ పంచకం యో న జానాతి - న ప్రసీదతి దేవతా
తస్మా త్సర్వప్రయత్నేన - గృహ్ణీయా న్మూలపంచకమ్॥

తా॥ ఈ పంచకము ఎవరికి తెలియదో వారికి దేవతానుగ్రహము కలుగదు. కావున సర్వ ప్రయత్నములు చేసి మూలపంచకమును గ్రహింపవలెను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయ సంవాదే
చక్రలక్షణకథనం నామ
అష్టషష్టి తమః పటలః

# శ్రీ పరాశర సంహితా

## ఏకోనసప్తతితమః పటలః

### కర్మాచరణ విధానం

శ్రీపరాశరః—

శ్లో॥ మైత్రేయ జపతాం నిత్యం - మంత్ర మేకం హనూమతః
సప్తకోటి మహామంత్రా - స్సిధ్యం త్యేవ న సంశయః॥

తా॥ శ్రీపరాశరులవారు చెప్పుచున్నారు. ఓ మైత్రేయా ప్రతిదినము ఒక్క హనుమంతుని మంత్రమును జపించువారికైనను సప్తకోటి మహా మంత్రములు సిద్ధించుచున్నవి. ఇందు సందేహములేదు.

శ్లో॥ ఆరాధితే కపిశ్రేష్ఠే - సమస్తా అపి దేవతాః
భవంతి సతతం తుష్టాః - సర్వదేవాత్మకో హి సః॥

తా॥ హనుమంతుడు ఆరాధింపబడుటవలన సమస్త దేవతలు ఎల్లప్పుడు సంతృప్తులౌదురు. ఏలనన హనుమంతుడు సర్వదేవాత్మకుడుకదా!

శ్లో॥ ఏవ కేనా ప్యుపాయేన - హనూమ త్పూజనై ర్బుధః
దివసం సఫలం కుర్యాత్ - స్తోత్రై ర్వా వందనై రపి॥

తా॥ జ్ఞానియగువాడు స్తోత్రములద్వారా కాని, నమస్కారముల వలన కాని ఏదో యొక ఉపాయముతో హనుమంతుని పూజనల్పుచు ప్రతిదినమును సఫలముచేసికొన వలెను.

శ్లో॥ పాయసం ఘృతసంపూర్ణం - మందవారేషు పంచసు
మర్కటా యార్పయే ద్ధీమాన్ - హనూమాం స్తేన తుష్యతి॥

తా॥ బాగుగా నేయివైచిన పాయసమును ఐదు శనివారములందు బుద్ధిశాలియగువాడు హనుమంతున కర్పింపవలెను. అట్లు చేయుటవలన ఆంజనేయుడు మిక్కిలి సంతృప్తిచెందును.

శ్లో॥ వాలముద్రాం ప్రకుర్వీత - జపాదౌ మంత్రవిత్తమః
జపాంతే చ తథా కుర్యా - దామ్నాయే ప్రణవం యథా॥

తా॥ మంత్రవేత్తయగువాడు హనుమన్మంత్ర జపమునకు ముందు వాలముద్రను వేయవలెను. జపాంతమునందును ఈ ముద్రను వేయ వలెను. వేదమంత్రము పఠించుటకు ముందు, వేదమంత్రముల అనంత రము ఓంకారము ఎంత ముఖ్యమో హనుమన్మంత్రమునకు వాలముద్ర అంత ముఖ్యము. వాలముద్రవేయు విధానము 81 వ పటలమున గలదు.

శ్లో॥ వాలముద్రా ప్రభావేన - జప స్సంపూర్ణతాం వ్రజేత్
హనూమా నపి సంతుష్టో - మంత్రరాజాధిదైవతమ్॥

తా॥ వాలముద్రా ప్రభావమువలన జపము సంపూర్ణతనందును. మంత్రరాజాధి దైవతమైన హనుమంతుడు వాలముద్రా ప్రభావమువలన సంతోషము నందును.

శ్లో॥ య త్కర్మ విహితం నిత్యం - కామ్యం నైమిత్తికం తు వా
ప్రాతఃకాలే కృతం స్యాచ్చే - త్త దుత్తమ ఫలప్రదమ్॥

తా॥ ప్రతినిత్యము ఏకామ్య కర్మకాని, నైమిత్తిక కర్మగాని విధింపబడునో అది ప్రాతఃకాలమున ఆచరించినచో ఉత్తమ ఫలితము నిచ్చును.

శ్లో॥ దైవా త్ప్రమాదా దాలస్యా - ద్యది కర్మాది లంఘనం
నిత్యాదీ న్యపి కర్మాణి - న యథోక్త ఫలాని వై॥

తా॥ విధి వశమునకాని, ప్రమాదవశాత్తుగాని, అలస్యకారణమున కాని కర్మను ఉల్లంఘించినచో అది నిత్యకర్మమైనను శాస్త్రోక్తమైన ఫలితముల నది ఈయజాలదు.

శ్లో॥ జంతు ర్బద్ధోఽపి సంసారే - సుఖదుఃఖమయే సదా
నిర్లిప్త ఇవ వర్తేత - పద్మపత్ర మి వాఽంభసి॥

తా॥ మనుష్యుడు సుఖదుఃఖమయమైన సంసారమున బంధింప బడినను నీటియందు తామరాకు నిర్లిప్తముగా నుండునట్లు జాగరూకుడై యుండవలెను.

శ్లో॥ స్వాభీష్ట దేవతా సక్త - హృదయ శ్శుద్ధమానసః
కులాల కీటవ న్నిత్యం - నయే త్కాల మతంద్రితః॥

తా॥ తన అభీష్టదేవతయందు మనస్సు లగ్నముచేసి పరిశుద్ధ మనస్కుడై ఏమాత్రము మైమరపు లేక కులాలకీటన్యాయముగా నిత్యము కాలము గడుపవలెను. కులాలకీటమనగా కుమ్మరిపురుగు. కుమ్మరిపురుగు ఎన్నిసార్లు మట్టిలో దూరినను దానికి ఏమాత్రము మట్టి అంటదు. అట్లు అంటని రీతిగా సంసారమున కాలముగడుపవలె ననుటకే కులాల కీట న్యాయము చెప్పుదురు.

శ్లో॥ దుఃఖ మి త్యేవ నో భీతిం - సుఖ మి త్యుచ్ఛ్రయం తు వా
ప్రాప్నుయా న్మతిమాన్ జంతుః కర్మాధీనం జగ ద్యతః॥

తా॥ బుద్ధిశాలియగువాడు దుఃఖమయమని ఈ సంసారమునుగూర్చి భయమును కాని, సుఖమయమని పొంగిపోవుటకాని పొందడు. ఏలనన ఈ జగత్తు కర్మాధీనము కదా! తాను చేసిన కర్మను బట్టి సుఖములుకాని దుఃఖములుకాని ప్రాప్తించుట తప్ప వేరుకారణమేదియు లేదు.

శ్లో॥ కర్మా ణ్యపి సదా కుర్వన్ - విహితాని సమాచరేత్
విహితా న్యాచరన్ జంతుః - మనః పూతం సమాచరేత్॥

తా॥ ఎల్లప్పుడు విహిత కర్మలను ఆచరింపవలెను. అట్లు నియమింపబడిన కర్మల నాచరించుచు మనస్సును పవిత్రముగావించుకొనుచుండవలెను. పవిత్రమగుమనస్సుతో కర్మల నాచరించవలెననుట.

శ్లో॥ సాకల్యేన న శక్యంతే – కర్తుం కర్మాణి జంతుభిః
గహనా కర్మణో రీతిః – మనః పూతం సమాచరేత్॥

తా॥ కర్మవిధానము చాలలోతైనది. ఏ మనుజునకు కర్మలన్నింటిని పూర్తిగా నిర్వహించుటకు శక్యము కాదు. కావున ఆచరించెడి విహిత కర్మలను చిత్తశుద్ధితో చేయవలెను.

శ్లో॥ భక్తి శ్రద్ధా విశుద్ధాత్మా విహితం కించిదేవ వా
నిత్యం నైమిత్తికం వాపి – సదా కర్మ సమాచరేత్॥

తా॥ నిత్యకర్మలనైనను, నైమిత్తికకర్మలనైనను, విహితకర్మలనైనను, కొద్దిమాత్రపు కర్మలనైనను భక్తి, శ్రద్ధ, ఆత్మశుద్ధికలిగియే ఎప్పుడును ఆచరింపవలెను.

శ్లో॥ అహంకారం చ దంభం చ – విహాయ ఫలకామనాం
నిత్యం య త్క్రియతే కర్మ – హనూమాం స్తేన తుష్యతి॥

తా॥ అహంకారమును, దాంభికత్వమును, ఫలకామనను వీడి నిత్యము ఏ కర్మను ఆచరింతురో ఆ కర్మవలన హనుమంతుడు మిక్కిలి సంతృప్తిచెందును.

శ్లో॥ అన్నాదికం నిజాభీష్ట – దేవతాయై సమర్పితం
ప్రోక్షితం చాపి గాయత్ర్యా – భక్షయే ద్భక్తశేఖరః॥

తా॥ తన ఇష్టదైవమునకు సమర్పించినది, గాయత్రీ మంత్రముచే ప్రోక్షణమొనర్చినదియగు అన్నాదికమునే భక్తశ్రేష్ఠుడగువాడు భుజింపనగును.

శ్లో॥ కదాచి దపి నైవేద్యం – నోపేక్షేతా పి సంకటే
ఉచ్ఛిష్ట స్పృష్టదోషే వా – న త్యజే దపి కించ న॥

తా॥ ఎప్పుడును నైవేద్యమును స్వీకరించకుండ ఉండరాదు. కష్టమేర్పడినను నైవేద్యము విడువరాదు. ఇతరులు తినగా మిగిలినదని కాని, ఇతరులు ముట్టుకొనినదని కాని దోషగ్రస్తమని ఏ కొంచమైనను త్యజించరాదు.

శ్లో॥ ప్రమాదా దపి గర్వా ద్వా - తృప్తే శ్చా ఒరుచిభావనాత్
నివేది తాన్నరేణుం చ - పాత్రమధ్యే న శేషయేత్॥

తా॥ పొరపాటునకాని, గర్వమునకాని, తృప్తిగా తినియుండుట వలనకాని, రుచిగాలేదనికాని నివేదనమొనర్చిన అన్నరేణువునయిన పాత్ర మధ్యమున మిగల్చరాదు.

శ్లో॥ ఉల్లంఘనా త్ప్రసాదస్య - భక్తిః పూజా వృథా భవేత్
జాజ్వాల్యమాన జిహ్వాగ్రే - నీహార ఇవ పావకే॥

తా॥ ప్రసాదమును వదిలివేయుటవలన ఎంతటి భక్తియైనను, పూజయైనను వ్యర్థమగును. ఎట్లన గొప్పగా మండుచున్న అగ్నిదేవుని యొక్క జిహ్వాగ్రమగు మంటయందు మంచు బిందువుపడిన ఎట్లు వ్యర్థమై పోవునో అట్లు వ్యర్థమగుననుట.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయసంవాదే
కర్మాచరణవిధానంనామ
ఏకోనసప్తతిఃపటలః

# శ్రీ పరాశర సంహితా

## సప్తత్రింశః పటలః

## హనుమతత్త్వకథనం

శ్రీ పరాశరః-

శ్లో॥ యో వా బిభ ర్త్యనంతాని నామాని వివిధా న్యపి
యస్యావతారా బహవో - మత్స్య కూర్మాది రూపిణః॥

తా॥ శ్రీ పరాశరులవారు చెప్పుచున్నారు. ఎవరైతే వివిధములైన అనంతనామధేయములను వహించుచున్నారో మత్స్య, కూర్మాదిగా ఎవరికి అనేక అవతారములు కలవో

శ్లో॥ సర్వత్ర సమతా బుద్ధ్యా - జగ ద్రక్షంతి సర్వదా
జేష్టా శ్చ వివిధా యస్య - భ క్తానుగ్రహ హేతవః॥

తా॥ అంతట సమబుద్ధితో ఎవరైతే ఎల్లప్పుడు ఈ జగత్తును రక్షించుచున్నారో, భక్తులను అనుగ్రహించుచే కారణముగా ఎవరు వివిధములైన చేష్టలు కల్గియున్నారో,

శ్లో॥ తత్త ద్భక్తానుకూలాని - రూపా ణ్యంగీకరోతి యః
పునాతి సకలాన్ లోకాన్ - చరిత్రైః పరమాద్భుతైః॥

తా॥ ఎవరైతే ఆయాభక్తులకనుకూలమైన రూపముల నన్నింటి నంగీకరించుచున్నారో ఏవరు తనయొక్క అద్భుతమైన చరిత్రతో లోకములన్నింటిని పవిత్రమొనర్చుచున్నారో

శ్లో॥ సమ స్తోపనిషద్వాచో - యత్ర సిద్ధాంత మాశ్రితాః
సృజ త్యఖిలజంతూ న్యః - సృష్టౌ బ్రహ్మస్వరూపధృత్॥

తా॥ సమస్త ఉపనిషద్వాక్యములు ఎవని విషయమున సిద్ధాంతము నొనర్చుచున్నవో, సృష్టియందు బ్రహ్మస్వరూపము ధరించి ఎవరైతే సమస్త ప్రాణులను సృష్టిచేయుచున్నారో,

శ్లో॥ సృష్టా నఖిల జంతూ న్యః- ప్రతిష్ఠాపయతి ప్రభుః
విలాపయ త్యథో జంతూన్ త త్ర తత్కర్మానుసారతః॥

తా॥ సృషించిన ప్రాణులన్నింటిని ఎవరు సమర్థతతో నిల్పుచున్నారో, ఆయా ప్రాణుల కర్మలననుసరించి చివరకు మరణాదికముచే ఎవరు దుఃఖమున ముంచుచున్నారో

శ్లో॥ స ఏవ హనుమాన్ జ్ఞేయ - స్సర్వభూతమయ శ్శుచిః

తా॥ ఆమహనీయుడే సర్వ ప్రాణిమయుడైనట్టి, శుద్ధమూర్తియైన శ్రీహనుమంతుడని తెలిసికొనదగును.

శ్లో॥ త మేవ జానీహి జగద్గురుం మునే।
త మేవ సర్వ క్రతుభోక్తు రూపిణం।
త మేవ సర్వక్రతు సిద్ధి దాయకం
త మేవ సర్వక్రతు హవ్యరూపిణమ్॥

తా॥ ఓ మైత్రేయ మహామునీ! ఆ హనుమంతునే జగద్గురువుగా తెలిసికొనుము. సర్వక్రతువులందు భోక్తగా ఆ హనుమంతునే తెలిసికొనుము. సర్వ క్రతువులకు సిద్ధిప్రదాత ఆ హనుమంతుడేయని తెలిసికొను. ఆ హనుమంతునే సర్వక్రతువులందు హవ్యరూపునిగాకూడ తెలిసికొనుము.

శ్లో॥ సమస్త శబ్ద ప్రతిపాద్య మూర్తిః
సమస్త కల్యాణ గుణాభిరామః
సమస్త జీవా ననిశం బిభర్తి
సూత్రం యథా హారమణీన్ హనూమాన్॥

తా॥ సమస్త శబ్దములతోను ప్రతిపాద్యుడగు మూర్తి ఆ హనుమంతుడే. సమస్త మంగళ ప్రదములగు గుణములతో ప్రకాశించువాడు ఆ హనుమంతుడే. దారము ఏరీతిగా హారమందలి మణులనన్నిటిని బంధించి నిలుపునో అట్లు సమస్త ప్రాణులను ఎల్లవేళల భరించువాడు కూడ ఆ హనుమంతుడే.

శ్లో॥ స ఏకఏవా ఒఖిల విశ్వరూపధృత్
స్వర్ణం యథా కంకణ కుండలాత్మధృత్
అనా ద్యవిద్యావశ రూప నామని
త త్రైకవస్తు ప్రతికల్పితే ఉభే॥

తా॥ బంగారము ఒక్కటే కంకణరూపము, కుండలరూపము ధరించినట్లు అఖిల విశ్వరూపమును ధరించిన ఆ హనుమంతుడు ఒక్కడే పలురూపముల కానవచ్చుచున్నాడు. అనాద్య విద్యావశమున ఏర్పడిన రూపనామములవలన ఒక వస్తువునందే రెండును కల్పింపబడుచున్నవి.

శ్లో॥ ద్వయం హనూమ త్యపి కల్పితం మృషా
నామాని రూపం వ్యవహారసిద్ధయే
మాయావశా దాత్మని సచ్చిదాత్మ
ప్రబుధ్యతే య స్తు తర త్యయం జనః॥

తా॥ హనుమంతుని ఒక్కనియందే రెండురూపముల కల్పనము అశక్యముగునది. నామములు, రూపము వ్యవహార సిద్ధికొఅకే. అవిమాయా వశమున ఏర్పడినవే. ఎవడైతే తన ఆత్మయందే సత్ చిత్మయుడైన పరమాత్మను తెలిసికొనగల్గునోవాడు సంసార బంధమునుదాటి మోక్షము నందును.

శ్లో॥ చరాచర మిదం విశ్వం సర్వం హనుమదాత్మకం
విభావయంతి యే త్వేవం తే తరంతి న సంశయః॥

తా॥ ఈ చరాచర ప్రపంచమంతయు హనుమదాత్మకమైనది. ఈ విధముగా ఎవరు భావింతురో వారు నిస్సందేహముగా తరింతురు.

శ్లో॥ ఏవం భావయితుం యే వై న సమర్థాః పృథగ్జనాః
ఉదీర్యతా మతిస్వచ్ఛం తై ర్విశ్వం హనుమన్మయమ్॥

తా॥ ఇట్లు భావింపలేనివారు మూర్ఖులు. వారు విశ్వమంతయు హనున్మయము అని స్వచ్ఛముగా పల్కుదురు గాక।

శ్లో॥ అత్రైవోదాహరం తీమం - ఇతిహాసం పురాతనం
యస్య శ్రవణమాత్రేణ — పరాం ప్రీతి మవాప్స్యసి॥

తా॥ ఈవిషయమునందీ పురాతనమైన ఇతిహాసమును ఉదాహరణముగా చెప్పుదురు. దీనిని వినుటవలననే పరమానందము పొందగలవు.

శ్లో॥ పురా పురందర శ్శ్రీమాన్ - వృత్రాసుర వధోద్యతః
త న్మాయామోహిత స్వాంతో - నై వాత్మాన మబుధ్యత॥

తా॥ పూర్వము శ్రీమంతుడగు దేవేంద్రుడు వృత్రాసుర వధకు పూనినవాడై ఆ రాక్షసుని మాయవలన మోహితుడై మైరచియుండెను.

శ్లో॥ పపాత సహసా వజ్రం స్తంభీభూ తేంద్రపాణితః
తతో గురు స్సమాగత్య - బృహస్పతి రుదారధీః॥

తా॥ స్తంభీభూతుడైన ఇంద్రుని చేతినుండి ఒక్కమారుగా వజ్రాయుధము పడిపోయెను, పిమ్మట గొప్ప బుద్ధిశాలియగు దేవగురువు బృహస్పతివచ్చి

శ్లో॥ ఇదం హనుమత స్తోత్రం - శక్రా యోపదిదేశహ
గురూపదిష్ట హనుమ - త్స్తోత్రరాజ శ్శచీపతిః॥

తా॥ దేవేంద్రునకు ఈహనుమత్స్తోత్రమును ఉపదేశించెను. గురువుచే ఉపదేశింపబడిన స్తోత్రరాజముకల దేవేంద్రుడు

శ్లో॥ ఉత్థాయ మూర్ఛనా చ్ఛక్రః — సుప్తోత్థిత ఇవ ద్రుతం
గురూపదిష్ట విధినా - తుష్టావ కపినాయకమ్॥

తా॥ వెంటనే నిద్రనుండి మేల్కాంచినట్లు మూర్ఛనుండి తేరుకొనెను. పిదప గురువు ఉపదేశించిన రీతిగా శ్రీహనుమంతుని స్తోత్రము చేసెను.

ఇంద్ర ఉవాచ—

శ్లో॥ నమామి జగతాం నాథం జగ దారాధ్య వైభవం
సృష్టి స్థితి లయానాం చ - హేతు మీశ్వర మవ్యయమ్॥

తా॥ ఇంద్రుడు పల్కెను. ఈ జగత్తంతటికి ప్రభువును, జగత్తంతయు ఆరాధింపదగిన సంపదను, సృష్టి స్థితిలయములకు కారణమైన వానిని అవ్యయుడగు పరమేశ్వరునిగూర్చి నమస్కరించుచున్నాను.

శ్లో॥ పార్వతీగర్భ సంభూతం - సచ్చిదానంద విగ్రహం
యస్య కుక్షౌ సమావిష్టా - లోకా వై భూర్భువాదయః॥

తా॥ సత్-చిత్-ఆనందమయమూర్తిని, పార్వతీగర్భసంభూతుని నమస్కరించుచున్నాను. ఎవని ఉదరమునందు ఈ భూర్భువాది లోకము లన్నియు నిలచి

శ్లో॥ నిత్యం హి సుఖితా స్సంతి - త న్నమామి జగద్గురుం
యస్య ప్రసాదా న్మర్త్యో వై - మృత్యుం జయతి మానవః॥

తా॥ ఎల్లప్పుడు సుఖముగా ఉంటున్నవో అట్టి జగద్గురువగు హనుమంతుని నమస్కరించుచున్నాను. ఎవని అనుగ్రహమువలన మర్త్యుడై కూడ మృత్యువును మానవుడు జయింపగల్గుచున్నాడో

శ్లో॥ తమేవా హం నమస్కుర్యాం జరామరణ వర్జితమ్

తా॥ అట్టి జరామరణ రహితుడగు శ్రీ హనుమంతునకే నమస్కరించుచున్నాను.

శ్లో॥ హనుమ న్మూర్తయే తస్మై - నరనారాయణాత్మనే
అంజనాగర్భ సంభూత్యై - రక్షసాం వధహేతవే
పంపాతీర నివాసాయ - మారుతాయ నమో నమః॥

తా॥ నరనారాయణ స్వరూపుడైన హనుమన్మూర్తికి నమస్కరించు చున్నాను. అంజనాదేవి గర్భమున పుట్టినట్టియు, రాక్షసుల వధకు కారణమైనట్టియు, పంపా తీరమున విహరించునట్టియు, వాయునందనునకు నమస్కారము.

శ్లో॥ కపివరేశ్వరం కామితార్థదం
త్రిపురహాత్మజం దీనపోషకం

విపులవక్షసం - విమలచేతసం
ఉపకృతాగసా మపి భయావహమ్॥

తా॥ వానర వీరులకు ప్రభువైన వానిని, కోరిన కోర్కెల తీర్చు వానిని, త్రిపురాసురభంజనుడైన పరమశివుని వలన జన్మించినవానిని, దీనుల పోషించువానిని, విశాలమైన వక్షస్థలము కలవానిని, పరిశుద్ధ మనస్కుని, పాపమొనర్చిన వారికి భయావహుని హనుమంతుని గూర్చి నమస్కరించుచున్నాను.

శ్లో॥ పవన నందనం పావక ప్రభం
భవ విదారణం భాగ్య కారణం
ప్లవగ నాయకై ర్భావి తోద్యమం
నవకవిత్వయు గ్వాఙ్మయం భజే॥

తా॥ వాయునందనుని, అగ్నివంటి కాంతికల వానిని, సంసార బంధమును చీల్చువానిని, సంపదలొసగు వానిని, వానర నాయకులచే స్వీకరింపబడిన ఉద్యమము కలవానిని, నూతన కవిత్వ ప్రేరకమైన వాక్కులు కలవానిని హనుమంతుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ అంజలిగ్రహే ణాఽఽత్మ దైవతం
మంజుభాషితై ర్మానవోత్తమం
రంజయ త్సదా రామభూపతిం
అంజనా యశః పుంజ మాశ్రయే॥

తా॥ అంజలి ఘటించి తన దైవమగు మానవోత్తముడగు రఘురామమూర్తిని తన మనోహరమైన సంభాషణతో ఎల్లప్పుడు ఆనందింప జేసెడి అంజనాదేవి కీర్తిమొత్తమగు శ్రీ ఆంజనేయుని ఆశ్రయించుచున్నాను.

శ్లో॥ సుందరాననం సూర్య తేజసం
నందినాథవ న్నందితాఖిలం
మందరాద్రివ ద్బంధురాకృతిం
వందితం భజే వానరోత్తమమ్॥

తా॥ సుందరమైన ముఖము కలవానిని, సూర్యప్రకాశము కలవానిని, పరమశివుని వలె లోకములను సంతోషపెట్టువానిని, మందర పర్వతమువలె మనోజ్ఞమైన ఆకారము కలవానిని, వందనీయుడగు వాయుసుతుని నమస్కరించుచున్నాను.

శ్లో॥ కనక కుండలం ఘనత రాంగకం
దనుజ నాశనం ధర్మ విగ్రహం
జనక కన్యకా చరిత మంగళం
మనుమహే ఒంజనా మాని తాత్మకమ్॥

తా॥ బంగారు కుండలములు కలిగినట్టియు, గొప్ప అవయవములు కలిగినట్టియు, రాక్షసులను నాశనము చేయునట్టియు, ధర్మమే ఆకారముగా కలిగినట్టియు, జనకకన్యయగు సీతాదేవికి మంగళము చేకూర్చినట్టియు అంజనాదేవి యొక్క సుపుత్రుడగు ఆంజనేయునకు నమస్కరించుచున్నాను,

శ్లో॥ శ్రుతి రసాయనం స్తుతి పరాయణం
అతుల విక్రమం ఆర్త తారణం
కృత జగద్ధితం కేసరిప్రియం
మతిమతా వరం మానదం భజే॥

తా॥ శ్రవణ మధురమగు నామము కలవాడును, స్తోత్ర ప్రియుడును, అమేయ పరాక్రముడును, ఆర్తత్రాణ పరాయణుడును, జగత్తునకు మేలుకూర్చువాడును, కేసరికి ప్రియసుతుడును, బుద్ధిమంతులలో శ్రేష్ఠుడును, మాన సంరక్షకుడును అగు హనుమంతునకు నమస్కరించు చున్నాను.

శ్లో॥ నిబిడ ముష్టినా నిహత రావణం
ప్రబల భావనా భావి పద్మజం
కబళి తారుణం గాన లోలుపం
విబుధ తోషకం వీర మాశ్రయే॥

తా॥ గట్టి పిడికిలిచే రావణుని కొట్టినవాడు, గొప్ప శక్తివలన భవిష్యద్బ్రహ్మయైనవాడు, సూర్యుని కబళించిన వాడు, గానప్రియుడు, పండితులను, దేవతలను సంతోషపెట్టువాడు, వీరుడు అగు హనుమంతుని ఆశ్రయించు చున్నాను.

శ్లో॥ పరమ పావనం పార్వతీ సుతం
నిరుప మౌజసం నిర్జి తేంద్రియం
ఖరన ఖాయుధం కామరూపిణం
సురపతి స్తుతం శూర మాశ్రయే॥

తా॥ పరమపావనుడును, పార్వతీనందనుడును, సాటిలేని పరాక్రమము కలవాడును, ఇంద్రియములను జయించిన వాడును, వాడియైన గోళ్ళు ఆయుధముగా కలవాడును, కోరిన రూపమందగలవాడును, దేవేంద్రునిచే స్తుతింపబడు వాడును అగు శూరుని ఆశ్రయింతును.

శ్లో॥ గంధమాదన శైలాగ్ర హేమరంభా వనాశ్రయ।
హనుమన్ రక్ష మాం దీనం సర్వభూత దయాపర।

తా॥ గంధమాదన పర్వత శిఖరమందలి బంగరు అరటి తోట ఆశ్రయముగా కలవాడా। సర్వప్రాణులయందు దయకలవాడా। ఓ హనుమంతా। దీనుడనగు నన్ను రక్షింపుము.

శ్లో॥ సంసార కుహర ధ్వాంత - నితాంత భ్రాంత చేతసం
హనుమన్ మా మనాథం త్వం - కిమర్థం సముపేక్షసే॥

తా॥ సంసారమను గుహయందలి చీకటిచే ఎల్లప్పుడు పొరపాటు పడు మనస్సు కల దీనుడనగు నన్ను ఓ హనుమంతా। ఎందుకు ఉపేక్షించు చున్నావు?

శ్లో॥ హనుమన్ మధురాస్వాద - కదళీఫల పాణయే
అమోఘ స్వర్ణ టంకాయ - కర్కటీ హారిణే నమః॥

తా॥ ఓ హనుమంతా। మధురముగా తినదగిన అరటి పండును చేతియందుకల, అమోఘమగు బంగారు గడ్డపార చేతియందుకల, కర్కాటక రాశికి హారము వంటి వాడగు హనుమంతునకు నమస్కారము.

శ్లో॥ ఉష్ట్రారూఢః కపిశ్రేష్ఠ - త్వ త్పాద ధ్యాన సంశ్రయం
దుఃఖ సంసార మగ్నం మాం - సముద్ధర జగత్పతే॥

తా॥ ఒంటె వాహనముగా కలవాడా! వానరశ్రేష్ఠుడా! ఓ జగన్నాథా! దుఃఖమయమగు సంసారమున మునిగియున్నట్టి, నీ పాద ధ్యానము నాశ్రయించినట్టి నన్ను ఉద్ధరింపుము.

శ్లో॥ రేతో మూత్ర పురీషా ఽసృ క్పూయ దుర్గంధ జర్జరం
భగ మేహన సంయోగం - మూఢో వై మన్యతే సుఖమ్॥

తా॥ రేతస్సు, మూత్రము, మలము, రక్తము, చీము మున్నగు వానిచే శిథిలమైన యోని లింగముల సంయోగమును సుఖముగా తలచువాడు మూర్ఖుడు కదా!

శ్లో॥ త్వ త్సేవా విముఖా నిత్యం - హనుమన్ బత జంతవః
వృథా మూఢధియో జాతాః - శిశ్నోదర పరాయణాః॥

తా॥ హనుమంతా! ప్రాణులు నీ సేవ చేయజాలక వ్యర్థముగా మూర్ఖ బుద్ధినంది ఉదర పోషణము, మైథునములతోనే కాలము పుచ్చుచున్నారు కదా!

శ్లో॥ తృణమ ప్యచల త్యశేష బంధో!
కపికులనాథ! త్వ దాజ్ఞయా వినా వై
ఇతి జగ దఖిలం విధేయ భూతం
విదితవతాం న కదాపి దుఃఖలేశః॥

తా॥ ఓ సర్వలోక బంధువా! వానర కులశ్రేష్ఠా! నీ అజ్ఞ లేకున్న గడ్డిపోచకూడ కదులదు. అని జగత్తంతను నీకు విధేయమై దానినిగ తెలిసికొను వానికెన్నడును దుఃఖము లేశమాత్రము కూడ ఉండదు.

శ్లో॥ వందే వాయుతనూభవం సుచరితం వందే జగద్రూపిణం
వం వజ్రతనుం సురారి దళనం వందే దయాసాగరం
వందే పంచముఖం సుకుండల ధరం వందే కపీనాం పతిం
వందే సూర్యసుతా సఖం ప్రియఫలం వందే హనూమత్ప్రభుమ్॥

తా॥ వాయుసుతునకు నమస్కారము. సుచరితునకు, జగద్వ్యాపి యగు వానికి నమస్కారము. వజ్రసమాన దేహము కలవానికి నమస్కారము. రాక్షసుల నాశనమొనర్చు వానికి నమస్కారము. దయాసముద్రునకు నమస్కారము. ఐదు ముఖములు కలవానికి నమస్కారము. మంచి కుండలములు ధరించినవానికి నమస్కారము. వానర రాజునకు నమస్కారము. సువర్చలా సఖునకు నమస్కారము. ఇష్టఫల రూపుడగు శ్రీ హనుమత్ప్రభువునకు నమస్కారము.

శ్లో॥ ధన్యా వాచః కపివర గుణ స్తోత్రపూతాః కవీనాం
ధన్యో జంతు ర్జగతి హనుమ త్పాదపూజా ప్రవీణః
ధన్యా పంపా సతత హనుమ త్పాదముద్రాభిరామా
ధన్యం లోకే కపికుల మభూ దాంజనేయావతారాత్॥

తా॥ వానర వీరుడగు హనుమంతుని గుణములను స్తోత్రము చేయుటచే పవిత్రములైన కవుల యొక్క వాక్కులే ధన్యములు. లోకమున హనుమత్పాద పూజను చేయుటలో ప్రవీణమైన ప్రాణియే ధన్యమైనది. ఎల్లప్పుడు హనుమంతుని పాదముద్రలచే ప్రకాశించెడి పంపా సరోవర ప్రదేశమే ధన్యమైనది. శ్రీ ఆంజనేయుని అవతారము వలన లోకమున కపికులమే ధన్యమైనది.

శ్లో॥ ఇతి స్తుత్వా హనూమంతం – సహస్రాక్ష శ్శచీపతిః
సంప్రాప్త విక్రమ స్తూర్ణం – సుప్తోత్థిత ఇవాఽభవత్॥

తా॥ అని హనుమంతుని స్తుతియించి శచీ నాథుడును, సహస్రాక్షుడును అయిన దేవేంద్రుడు మిక్కిలి పరాక్రమము చేకూరినవాడై నిద్ర నుండి మేల్కాంచినవాని వలె తెలివినందెను.

శ్లో॥ సమాదాయ పున ర్వజ్రం – వృత్రాయ ప్రజిఘాయ సః
తతో వజ్రహతో వృత్రః – పపాత చ మమార చ॥

తా॥ దేవేంద్రుడు మరల వజ్రాయుధము తీసుకొని వృత్రాసురునిపై ప్రయోగించెను. అంతట వజ్రాయుధముచే కొట్టబడిన వృత్రాసురుడు నేలబడి చచ్చెను.

శ్లో॥ పఠంతి యే స్తోత్ర మిదం పవిత్రం
జిగీషవ స్తే ఒరిజయం ప్రయాంతి
అస్మాక మంతర్ద్విషతా మపేక్షయా
హనూమత స్తోత్రబలా దభూ త్పరా॥

తా॥ ఈ పవిత్రమైన స్తోత్రము నెవ్వరు పఠింతురో జయకాంక్షులగు వారు శత్రుజయమును పొందగల్గుదురు. మాకు కూడ పూర్వము అంతశ్శత్రువుల విషయమున ఈ హనుమత్ స్తోత్ర బలమువ విజయము లభించెను.

శ్లో॥ భవా నపి స్వైరచరో హి నూనం
భవిష్యసి ప్రాప్త మహానుభావః
మైత్రేయ తస్మా ద్భవ తోపదిశ్యతాం
హనూమత స్తోత్ర మిదం యథార్థతః॥

తా॥ ఓ మైత్రేయా! నీవు కూడా శ్రీ హనుమంతుని స్తోత్రమహిమచే బాహ్యాంత శ్శత్రువుల నణచి స్వైరచరుడవై గొప్ప అనుభవమును పొందిన వాడవు కాగలవు. కావున అర్థాతననుసరించి నీకు ఈ హనుమత్ స్తోత్రము ఉపదేశింప బడుగాక!

శ్లో॥ ద్వైతాశ్రమేషు విచర న్మని గేయమానా
న్యత్యద్భుతాని హనుమ చ్చరితాని శృణ్వన్
కల్పా న్బహూ నపి నయామి ముహూర్త మాత్ర
మానందసాగర నిమగ్న నిజాంతరంగః॥

తా॥ ఓ మైత్రేయా! నేను ద్వైతాశ్రమములందు సంచరించుచు గానము చేయబడెడి అత్యద్భుతములగు హనుమచ్చరితములను వినుచు ఆ ఆనందమున నామానసము నిమగ్నమైయుండ అనేక కల్పములను కూడ క్షణములో గడుపుచున్నాను.

ఇతి శ్రీ పరాశర సంహితాయాం
పరాశర మైత్రేయసంవాదే హనుమత్తత్త్వ కథనం నామ
సప్తతితమః పటలః

త్వరలో తదుపరి భాగము వెలువడును

# దాతలు

| | | |
|---|---|---|
| శ్రీమతి అండ్ శ్రీ టి. మల్లిఖార్జునరావు, హైదరాబాదు | రు. | 300 |
| శ్రీ శీతేపల్లి రాధాకృష్ణమూర్తి, విజయవాడ | ,, | 300 |
| [మూడురీముల పేపరు ఇచ్చినారు] | ,, | |
| శ్రీమతి బి. జానకమ్మ, శ్రీరాములు, చేగుర్తి | ,, | 116 |
| శ్రీ ఎర్మారెడ్డి పుల్లారెడ్డి, కరీంనగరము | ,, | 27 |
| శ్రీ కనకపర్తి సీతారామయ్య శకుంతల, కరీంనగరము | ,, | 27 |
| శ్రీ నేదునూరి వామనరావు, సుగుణ, కరీంనగరము | ,, | 27 |
| శ్రీ నలువాల హన్మండ్లు, శారద, జగిత్యాల | ,, | 15 |